Studio Roopkala











మాధవీ ప్రొడక్షన్స్

# పాండవ వనవాసము

దర్శకత్వం: K. కామేశ్వరరావు B.A., నిర్మాత: A.S.R. ఆంజనేయులు

# OR WO ఆర్వో కలర్

ఆర్వో కలర్ ఫిలింతో స్వాభావసిద్ధమైన రంగులను యధాతధంగా ఫొటో తీయువచ్చును. బ్లాక్ అండ్ వైట్ ఫిలింవలె దీనిని ఉపయోగించటం చాల సులభం. ఆర్వో కలర్ ఫిలిం, యూరప్‌లోని పెద్ద ఫిలిం ఫ్యాక్టరీ మరియు కలర్ ఫిలిం తయారుచేయుటలో అగ్రగణ్యులైన వెబ్ ఫిలింఫాబ్రిక్ వుల్ఫన్, జర్మన్ డెమోక్రాటిక్ రిపబ్లిక్ వారి శ్రేష్ఠమైన తయారి.

ఇండియాలో ప్రాసెసింగ్ చేయబడుచున్నది.
వివరములు ఆర్వో వ్యాపారివద్ద లభించును.




**VEB FILMFABRIK WOLFEN**
German Democratic Republic
ఆర్వో ఫిల్మ్స ఈస్టర్న్ యూనిట్
మద్రాసు - 2 :: కలకత్తా - 13

SGS/4/65

# ఉత్తరాలు

## కాంబోడియా దృశ్యాలు

ఇతర దేశములయొక్క వంగతులు ఆంధ్ర ప్రజలు తెలుసుకొనుటకు ఇటువంటి ప్రచురణములు అవసరము. ఇతర దేశపు ప్రజల ఆచార వ్యవహారములు వారి కట్టుబొట్లు నిత్య జీవితము మొదలగునవి తెలియటం అవసరము. ఇట్టి వ్యాసములలో ఆదేశపు శీతోష్ణ స్థితిగతులు, వారు నివసించు ఇండ్లు, భూమి ఎటుల యున్నది అనగా ఇసుక ప్రదేశమా, ఎర్రనేల, రేగడి భూములా మొదలగున విన్ని తెలుపుచు ప్రచురించుచుండిన మన ఆంధ్ర ప్రజానీకమునకు విజ్ఞానము పెంపొందునని వినయ పూర్వకముగా అరిం చుచున్నాను.

శ్రీ ఆ. శివరామబ్రహ్మంగారు వారి అనుభవములు తెలుగునాడులో ఆంధ్ర సచిత్ర వారపత్రిక ద్వారా వాడ వాడ అందచేయవలయునని ప్రార్థన.

పొత్తూరు వెంకట రంగారావు (భద్రాచలం)

## వ్యా సా లు

26—2—65 పత్రికలో మీరు ప్రచురించిన వ్యాసం "కళల సీడన బ్రతుకు తెరువు" ఎన్నెంతో ఆకర్షించింది. ఇలాంటి వ్యాసాల ద్వారా మరుగుపడిన కళాకారుల జీవితాలకు మెరుగు పెట్టగలగా రవుతున్నారు, రచయితలు. మన భారతదేశంలో తెర వెనుకపడిన ఇలాంటి కళాకారు లెందరున్నారో! వాళ్ళ జీవితపు లోతుపాతులను, వారి అద్వితీయ కళా కౌశల్యతను తెలుసుకోడానికి ఎవ్వరూ ప్రయత్నించరు. ఈ శ్రమ జీవుల అనన్య కళారాధన వలన మన కళామతల్లి కరకమలములచే స్పృశింపబడని వస్తువేలేదు. రచయితకీ వారి పార్ట్‌నర్‌కీ నా హార్టీ థ్యాంక్స్.

కుమారి శాంతి (నెల్లూరు)

## కథ

19—2—65 సంచికలోని యద్దనపూడి సులోచనారాణిగారి 'ఓ డి పో యా ను' కథలో 'సుజా' పాత్రలో చెలరేగిన ఆత్మ సంఘర్షణను చాలా చక్కగా చిత్రించారు. ముఖ్యంగా రాజాపై ఆమెకు ఎంతో కోపం ఉన్నా క్రికెట్ కామెంట్రీ వచ్చేటప్పుడు ఆమెలో కలిగిన సంచలనాన్ని, రకరకాల బాధలను రచయిత్రి చాలా చక్కగా పాఠకుల ముందుంచారు.

పర్స భాస్కరరావు (ఖమ్మం)

## భాషావివాదం

ఉత్తర ఇండియాలో, దక్షిణ ఇండియాలో..... మంత్రులలో, ముఖ్యమంత్రులలో ఎంతమందికి "హింది" మాట్లాడటం, వ్రాయటం చేయగలరు?

జనవరి ఇరవై ఆరు నుండి లోకసభ, రాజ్యసభలలోని చర్చలు హిందీలోనే కొనసాగుతున్నాయా? ఆర్థికంగా విదేశాల సహాయం పొందుతున్న భారతదేశం, విదేశీ భాష అయిన ఇంగ్లీష్ రాజభాషగా ఉపయోగించుకొంటే నష్టం ఏమిటి?

వలిగొండ శాంతమూర్తి (మచిలీపట్నం) ★

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 26–3–'65
క్రోధినామ సం॥ ఫాల్గుణ మాస బ॥ నవమి
సంపుటము : 57 సంచిక : 30

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం
చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28.60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

| | |
|---|---|
| విడిప్రతి | 30 పై. |
| సంవత్సర చందా | 15.60 పై. |
| 6 మాసాల చందా | 7.80 పై. |

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1



"ఫింఛను పుచ్చుకునేవాళ్ళం, మనం కూడా విద్యార్థుల్లాగే గొడవచేస్తే మనపని బాగుంటి పోవునుకదా!..."

## మనలో మాట

పైవారం 'ఆంధ్రసచిత్ర వారపత్రిక' ఉగాది ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. ఉగాది ప్రత్యేక ఆకర్షణలు కొన్ని—

- ముఖచిత్రం – శ్రీబాపు
- సినిమా బాలట్ ఫలితాలు
- వనితాలోకం వ్యాసరచన పోటీలో నెగ్గిన వ్యాసాలు
- సరికొత్త బాలసాహితి శీర్షిక ప్రారంభం
- వెల మామూలే!

అనివార్య కారణాలవల్ల ఈ వారం కొన్ని మామూలు శీర్షికలు వెయ్యలేకపోతున్నాము.

* *

'మానసంరక్షణకోసం' శీర్షిక క్రింద తమ తమ మాన సంరక్షణకని కొందరు వ్యక్తులు చేసిన ప్రయత్నాల కథలు వివరించటం జరుగుతుంది. మొదటిది బ్రిటన్ దేశానికి చెందిన ఒక స్త్రీకి సంబంధించినది...

* * *

19-3-'65 ఆంధ్రసచిత్రవారపత్రిక అట్టలోపల బొమ్మలలో ఒకదాని క్రింద కుమారి జయలలిత పేరు బదులు కుమారి చంద్రకళ పేరు పడింది. అదే సంచికలో 'దొరికితే దొంగలు' చిత్రం బొమ్మ క్రింద 'చదువుకున్న భార్య' పేరు పొరపాటున పేర్కొనటం జరిగింది.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : కృష్ణకుమారి.



కేరళ ఎన్నికలు!
కమ్యూనిస్టు ప్రాబల్యం




నావ ఏనాటి కైనా గమ్యం చేరక పోతుందా?
తటస్థ విధానం
కేరళ సమస్య
ఆహార సమస్య
భాషా సమస్య




ఫలితం ఇదే
కేరళలో
కమ్యూనిస్టుల విజయం




ప్రశ్నార్థకం?
అసలీ అబ్దుల్లా ఎవరు?
భారతీయుడా?
పాకిస్తానీయుడా?
కాశ్మీరీయుడా? లేక
గూఢచారా?




ఢిల్లీలో నాలుగురోజులపాటు గడిపిన అనంతరం ఎడింబరో మహారాజు ఫిలిప్ స్వదేశానికి బయలుదేరి వెళ్లారు. విమానాశ్రయంవద్ద వీడ్కోలు చెప్పటానికి వచ్చిన వారిని ఆయన అభినందిస్తున్న దృశ్యం.

న్యూ ఢిల్లీ లేఖ

# ఉత్తర - దక్షిణ ప్రాంతాలలో కేంద్ర ప్రభుత్వం పెట్టుబడి : కొన్ని తారతమ్యాలు

ఇటీవలే కేంద్రప్రభుత్వం పెట్టిన పరిశ్రమల వివరాలు కొన్ని ప్రచురించటం జరిగింది. ఈ ప్రచురించిన వివరాలనుపట్టి చూస్తే 1963-64 కి మొత్తం పెట్టుబడి రు. 1730 కోట్లు ఉంది. (క్రితం ఏటికన్నా 309 కోట్లు ఎక్కువ.)

మూడవ ప్రణాళిక చివరికి కేంద్రం పెట్టుబడి రు 2400 కోట్లు ఉంటుందిట.

ఈ క్రింది పట్టీలో మొదటి పది సంస్థల పెట్టుబడి వివరాలు ఇస్తున్నాను —

| | | |
|---|---|---|
| హిందుస్తాన్ స్టీల్ | రు 804 | కోట్లు. |
| నైవేలీ లిగ్నయిట్ | రు 113 | ,, |
| హెవీ ఎంజినీరింగ్ | రు. 101 | ,, |
| ఎన్. సి డి సి. | రు. 088 | ,, |
| ఓ ఎన్. జి | రు. 086 | ,, |
| ఫెర్టిలయిజర్ కార్పొరేషన్ | రు 082 | ,, |
| హెవీ ఎలక్ట్రికల్స్ | రు 072 | ,, |
| ఇండియన్ రిఫయినరీ | రు 067 | ,, |
| ఎయిర్ ఇండియా | రు 031 | ,, |
| షిప్పింగ్ కార్పొరేషన్ | రు. 031 | ,, |

• నైవేలీ, రామచంద్రపురం ప్రాజక్టులను తీసివేస్తే మిగతావి అన్నీ ఉత్తర భారతదేశంలోనే ఉన్నట్లు గమనించవచ్చు. దక్షిణభారత దేశానికి (1) నెయివేలీ 113 కోట్లు, (2) రామచంద్రపురం 28.2 కోట్లు, (3) తిరువెంబూర్‌లోని హెవీ ఎలక్ట్రికల్ ప్రాజక్టు విభాగానికి 18.3 కోట్లు మినహాయిస్తే ఉత్తర దేశానికి రు. 1215 కోట్లు వచ్చాయన్నమాట !

బెంగుళూరులో హిందుస్థాన్ ఎయిర్‌క్రాఫ్టు, టెలిఫోన్ కంపెనీలు పెట్టటానికి వాతావరణం కారణం. వూటీలో ఫోటో ఫిలిం పెట్టటానికి కూడా కారణం ఇదే.

మద్రాస్‌లో హిందుస్తాన్ టెలిప్రింటర్స్, కొచ్చిన్‌లో నూనె కర్మాగారం కూడా ప్రణాళికలలో లేకపోలేదు. కాని మొత్తంమీద ఉత్తర ప్రాంతాల వాటాయే అధికం. దక్షిణానికి 159.5 కోట్లు రూపాయలు అయితే ఉత్తరాదికి 1215 కోట్లు రూపాయలు వచ్చాయి.

# న్యూఢిల్లీ లేఖ

కేరళలో ఒక పెద్ద కేంద్ర పరిశ్రమ కర్మాగారం కూడా లేదని గమనించ ప్రార్థన. ఇక వామ పక్షం కమ్యూనిస్టులు గెలుస్తున్నారంటే ఆశ్చర్యం ఏముంది ?

కేరళలో హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజక్టుల అవకాశాలు ఎన్నో ఉన్నాయి కాని ఒక పెద్ద ప్రాజక్టు రాలేదు. ఉత్తరప్రదేశ్‌లో మాత్రం (నైనిలో) రెండు పెడుతున్నారు. వార్ధాలో ఒకటి, హ్రిషికేశంలో, రాజస్థాన్‌లలో ఒకటి వస్తున్నాయి.

బెంగాల్, బీహార్, ఒరిస్సాలలో ఖనిజసంపదని బట్టి పరిశ్రమలు పెట్టారని వాదిస్తారు. సరే, బాగానే ఉంది. కాని, నైనీ, వార్ధాలలో ప్రాజక్టుల నిర్మాణానికి కారణాలు ఏమిటి ?

సోషలిజం అంటారు. అంటే, వ్యక్తుల మధ్య తారతమ్యాలు తగ్గాలనే కదా ? అసలు రాష్ట్రాల మధ్య తారతమ్యాలు తగ్గకపోతే వ్యక్తుల మధ్య తారతమ్యాలు తగ్గడం ఎప్పుడు ?

వామపక్షం కమ్యూనిస్టుల సంఖ్య (ఎరెస్టు అయినవారిని పట్టి వూహించవచ్చు !) కేరళ, ఆంధ్రప్రదేశ్‌లలోనే ఎక్కువ ఉండటానికి కారణం ఏమిటి ? ఇక్కడ ఉద్యోగావకాశాలు తక్కువ అవటంవల్ల కూడా అయిఉండవచ్చుకదా ?

**హిందీభాషకి ప్రత్యేక స్థానం ఇవ్వటంచేత 10,000 మంది 'అనువాదకుల' ఉద్యోగాలు సృష్టించవలసి వచ్చింది. ఇవి 'హిందీ-ఇతర' ప్రాంతాలవారికి ఎక్కువ ఎలా వస్తాయి ?**

బెంగాల్, మధ్యప్రదేశ్, బీహార్‌లలో బయటి ప్రాంతాలవారిని తక్కువగా చూస్తారు. రాంచీలో జరిగిన అల్లరికి కారణాలలో ఇదొకటి. 'కోటా' పద్ధతి కావాలనటానికి కారణం దక్షిణాదివారిని కేంద్ర ప్రభుత్వోద్యోగాలలో హింసించడమే కారణం అయి ఉండవచ్చు కూడా !

నాలుగు పెద్ద ఉక్కు కర్మాగారాలు బీహార్, బెంగాల్, ఒరిస్సాలలో నిర్మించారు. ఇక రాబోయేది అమెరికా—బ్రిటన్ సలహాదారుల సూచనలని పట్టి నిర్మిస్తారుట .....

గోవాలో మంచి ఇనుము ఖనిజం లేదుట. మద్రాసులో మంచి బొగ్గు లేదుట. కాని, మద్రాసులో రైల్వేకోచ్‌లు చెయ్యటానికి వీలు ఉంది, వారణాసిలో డీసెల్ ఎంజిన్లు చెయ్యవచ్చు. ఇదే, జాతీయ సమైక్యతకి నిదర్శనం.

శ్రీ టి. టి. కృష్ణమాచారిగారు నామినేషన్ కాగితాలు దాఖలు చెయ్యగానే స్టాక్ ఎక్స్‌ఛేంజి పడింది. కాని, శ్రీ మొరార్జీదేశాయి 61 కోట్ల అధిక సుంకాలు విధించినా పైకి వెళ్ళింది, 1961—62 లో. గత మాసం టి. టి. కృష్ణమాచారి పన్నులు తగ్గించిన తర్వాత కూడా స్టాక్ ఎక్స్‌ఛేంజి పడింది. బొంబాయి మార్కెట్టు గుబ**గుబలాడుతూ ఉంది.**

—శ్రీకృష్ణ ★



'మంగమ్మ శపథం'లో జమున

చిత్ర సమీక్షలు:

# వినోదాత్మక చిత్రం 'మంగమ్మ శపథం'

డి. వి. యస్. ప్రొడక్షన్స్‌వారి జానపద చిత్రం 'మంగమ్మ శపథం' ఇటీవలనే వాహినీ స్టూడియోలో పత్రికల వారికి చూపారు.

ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, రాజనాల, రేలంగి, రమణారెడ్డి, అల్లు రామలింగయ్య, మిక్కిలినేని, నల్లరామమూర్తి, బాలకృష్ణ, జమున, ఎల్. విజయలక్ష్మి, రాజశ్రీ, గిరిజ, ఛాయాదేవి మొదలగువారు నటించారు.

ఆడది అణగి మణగి ఉండక అర్థంలేని ఆవేశంతో ముందు చూపు లేకుండా ప్రవర్తిస్తే ఫలితం ఎంత తీవ్రంగా ఉంటుందో ఈ చిత్రంలో చూపారు. స్త్రీలోలుడైన మహారాజ సామాన్య యువతి మంగమ్మను చూచి ఆమె అంద చందాలకు ముగ్ధుడై మోజుపడ్తాడు, మంగమ్మ నిరాకరిస్తుంది. మహారాణిని చేస్తానని మహారాజా మాట ఇచ్చినా తనకు శీలమే ప్రధానం గానీ సంపద కాదని నిరాకరిస్తుంది. మహారాజా ఆవేశంతో రెచ్చిపోయి బలవంతంగా మంగమ్మను వివాహమాడి మరుక్షణంలోనే ఆమెను జీవితాంతం నిర్బంధంలో ఉంచి ఆమె శీల రక్షణకు తగిన ఏర్పాటు చేయిస్తానని ప్రతిజ్ఞ చేస్తాడు. అలా జరిగిన పక్షంలో మహారాజుకు తెలియకుండా అతని వల్లే ఓ కొడుకుని కని నిండు సభలో ఆ చిన్నవాని చేతే తగిన విధంగా బుద్ధి చెప్పిస్తానని మంగమ్మ శపథం చేస్తుంది. బలవంతంగా మహారాజుతో మంగమ్మ వివాహమైపోతుంది. మహారాజామెను అవసరమైన కట్టుదిట్టాలతో ఓ మందిరంలో ఉంచిన చేస్తాడు. మాయోపాయంతో మంగమ్మ బయటపడి మహారాజా ముందే మారువేషంతో నాట్యంచేసి అతని అనురాగాన్ని పొందుతుంది. మంగమ్మ శపథం చెల్లించటానికి కొడుకు పుడ్తాడు. కొడుకును తన తండ్రి దగ్గరే ఉంచి అన్ని విద్యలూ నేర్పిస్తుందిమంగమ్మ. పగలల్లా రాజమందిరంలోగడిపి, రాత్రిమాత్రం రహస్య మార్గాన వెళ్ళి తన బిడ్డను చూచుకొంటూ ఉంటుంది. పెరిగి పెద్దవాడైన తన కుమారుడు ప్రేమ కలాపాల్లో పడ్డవార్త తెల్సుకుని అతన్ని పిలిపించి తన శపథాన్ని గురించి చెప్పి తానింతవరకూ అష్టకష్టాలు అనుభవిస్తున్నది దాని కోసమేనని చెప్తుంది. కుమారుడు శపథాన్ని చెల్లిస్తానని మాట ఇచ్చి వెళ్తాడు. వివిధోపాయాలతో చివరికి మహారాజానే బంధించి తల్లి శపథాన్ని చెల్లిస్తాడు విజయనాథ్. మహారాజా జరిగిందానికి పశ్చాత్తాప పడి విజయనాథ్ తన కుమారునిగా తెలుసుకొని అతనికి, అతను ప్రేమించిన సేనాపతి కుమార్తె విజయకి వివాహం చెయ్యమని ఆజ్ఞాపించటంతో కథ సుఖాంతమౌతుంది.

మహారాజుగా ఎన్, టి. రామారావు నటన కొన్నిచోట్ల ఎబ్బెట్టుగా తోచినా ఆ పాత్రౌచిత్యాన్ని బట్టిచూస్తే సరిపోతుందనిపిస్తుంది. ద్విపాత్రాభినయం చక్కగా ఉంది. రేలంగి, రమణారెడ్డిల హాస్యం బాగుంది. అల్లు రామలింగయ్య హాస్యంలో కొత్తదనం కన్పించింది చిత్రంలో. మంగమ్మగా జమున నటన మెచ్చుకోదగ్గదిగానే ఉన్నది. యల్. విజయలక్ష్మి నటన పాత్రకు సరిపోయింది. కృషి చేస్తే ఇంకా చక్కని నటన చూపటాని కవకాశాలున్నాయి. సేనాపతిగా రాజనాల కొంతదాకా నటించారు. శ్రీ టి. వి. రాజు సంగీతం వీనులవిందుగా ఉన్నది. రెండు మూడు పాటలు బాగున్నాయి. అక్కడక్కడ చిన్న చిన్న లోపాలున్నా దర్శకత్వం ప్రతిభావంతంగానే ఉందనవచ్చు. సెట్టింగ్స్‌పట్ల ఇంకొంచం శ్రద్ధచూపిస్తే రమ్యంగా ఉండేది. మొత్తంమీద చూసిన రెండున్నర గంటలూ విసుగనిపించని వినోదాత్మకం 'మంగమ్మ శపథం.'

—మాధవ్

# కొత్త తరహా కథ 'చదువుకున్న భార్య'

శ్రీ రాజ రాజేశ్వరీ ఫిలిం కంపెనీవారి 'చదువుకున్న భార్య' చిత్రానికి కొత్త తరహా, కొత్తదనమూ గల సాంఘిక ఇతివృత్తమే ఆధారం. ఈ మధ్యనే ఈ చిత్రాన్ని జెమినీ స్టూడియోలో పత్రికల వారికి ప్రత్యేకంగా చూపారు.

కొంత ప్రేమ, కొంత కథ, కొంత హాస్యం కలిపి రూపొందించబడిన ఈ కథ చిత్రమైనది. తనను నిరాకరించిన యువతి మీద పగ సాధించాలని డాక్టర్ ప్రకాశ్ నడిపించిన కథయే ఈ ఇతివృత్తం. జగన్నాధరావుగారు ప్రకాశ్‌ను చిన్నతనంనుంచే పెంచి పెద్దచేసి చదువు చెప్పించి, డాక్టర్ చేయిస్తాడు. అతన్ని, తన అల్లునిగా చేసికోవాలని జగన్నాధరావుగారి ఆశ. కాని, అతని కుమార్తె డాక్టర్ జానకి తనని రక్షించిన యువ రచయిత అయిన కుమార్‌ను ప్రేమిస్తుంది. పెళ్ళాడుతుంది.

మాలిని అనే అమ్మాయి ప్రకాశ్‌ను ప్రేమిస్తుంది. ప్రకాశ్ కూడా తనను జానకి నిరాకరించేసరికి, చివరకు మాలినినే పెళ్ళి చేసికొంటాడు. ప్రకాశ్ డాక్టర్ వృత్తితో ఎంతో ధనార్జనం చేస్తుంటాడు. అయినా, అతని ధ్యానంతా జానకిమీద పగ సాధించాలనే!

కుమార్ సంసారంలో కలతలు రేగడం, జానకిని ఇంటినుంచి పంపివేయటంతో డాక్టర్ ప్రకాశ్‌కు తనపంతం చెల్లించుకొనే అవకాశం లభిస్తుంది. ఇంతలో కుమార్‌కారు ప్రమాదానికి గురి కావటం జరుగుతుంది. ఆపరేషన్ చేయటానికి ఆ పూరి మొత్తంలో డాక్టర్ ప్రకాశ్ ఒక్కరే సమర్థులు(?). గత్యంతరంలేక డాక్టర్ జానకి ప్రకాశ్‌వద్దకువెళ్ళి భర్త ప్రాణాలు కాపాడమని అడుగుతుంది. అందుకు ఫీజాగా శీలాన్నే ఇవ్వవలసి వస్తుందని ప్రకాశ్ చెప్పగా ఆమె సరేనంటుంది. విజయవంతంగా ఆపరేషన్ జరుగుతుంది. డాక్టరే తన తప్పిదాన్ని తెలిసికొని విచారిస్తాడు.

ఇందులో డాక్టర్ ప్రకాశ్‌గా జగ్గయ్య, మాలినిగా వాసంతి, డాక్టర్ జానకిగా కృష్ణకుమారి, కుమార్‌గా కాంతారావు నటించారు. పేకేటి, శలం, శారద, సూర్యకాంతం, ఛాయాదేవి ప్రభృతులు హాస్యం పోషించారు. సంగీతం మామూలుగా ఉంది. ప్రణయ ఘట్టాలు చూడవలసినదే గాని, చెప్పనలవిగాదు.

ఈ చిత్రం కీ. శే. కన్నాంబగారికి అంకితమివ్వబడింది.

—ప్ర. ★



# అమూల్ వెన్న అమోఘమైన రుచికరం...






మీ కుటుంబమును సరియైన రాచవిధిగా పోషించుకోండి— మీ ప్రియమైన భక్ష్యమునకు పైన అమూల్ వెన్న ముద్దను పూయండి. అమూల్ వెన్న అదనంగా కలిగించే రుచికరమైన సువాసన వల్ల ఆహారం చాలా ఎక్కువ రుచిగా వుంటుంది.— మరియు మీ ఆరోగ్యానికి మంచిదైన అధిక పుష్టి కూడా మీకు లభించుతుంది. డైరీలో చిలుకబడి అయిదు గంటలలోనే పాలదుత్త నుండి వెన్న ప్యాకెట్‌గా తయారైన శుద్ధమగు తాజాయైన మీగడ గల అమూల్ వెన్న శక్తిదాయకమైన ఏ. డి. సన్‌షైన్ విటమినులతో గూడియున్నది— ఎదిగే పిల్లలకు చాలా ముఖ్యం.

డైరీలో అపుడే...
తయారైన శుద్ధ క్రీమ్...

## అమూల్
## వెన్న

అమూల్ మీ ఆహారమం
తటికి అమూల్యమైన అధిక
పుష్టికరమగు మంచి ఫలిత
మును కలిగించుచున్నది.

కైరా కో-ఆప్. ఉత్పత్తి—అమూల్యమైనది.

కైరా డిస్ట్రిక్టు కో-ఆపరేటివ్ మిల్కు ప్రొడ్యూసర్స్ యూనియన్ లిమిటెడ్, ఆనంద్.



CBKMP-38 TEL

కొత్తశీర్షిక ప్రారంభం:

# మానసంరక్షణకోసం!

## పెళ్లికాని తల్లికి ప్రజాదరణ

నార్మన్ రొథామ్

విక్టోరియారాణి రాజ్యానికి వచ్చిన రెండు సంవత్సరాలకు (1837 లో) అక్కడ న్యాయస్థానంలో పనిచేసే ఒకమ్మాయిని గురించిన పుకార్లు లండన్ సమాజంలో సంచలనాన్ని కలిగించినయి.

హుషారైన, అందమైన అమ్మాయి పేరు ఫ్లోరా హేస్టింగ్స్ ఆమెను గురించి ఈ న్యాయస్థానంలో జరిగే గుసగుసలూ, తీవ్ర వివాదాలు పిల్లల పోట్లాటలా ఉందని అక్కడే పని చేస్తున్న వేరొకతను దీన్ని గురించి చెప్పాడు.

ఫ్లోరా హేస్టింగ్స్ స్కాటిష్ సెలవులనుంచి తిరిగి వచ్చిన తర్వాత కడుపులో ఏదో నొప్పిగా ఉండటాన్ని గమనించింది. ఈ విషయం తన మేనమామకు వ్రాసింది తర్వాత ఆమె న్యాయస్థాన వైద్యుడైన సర్‌జాన్‌క్లర్క్‌ని సంప్రదించింది. డాక్టర్ ఆమెను సరిగా పరీక్షించలేదు

"డాక్టర్ అసలు నా బాధను గురించి పట్టించుకున్నట్లు లేదు పోనీ, అసలు విషయమైనా అతను అర్థంచేసుకోలే దనుకుంటాను." అని చెప్పింది ఫ్లోరా.

"మీ వయస్సు 33 సంవత్సరాలు కదూ? మీకింకా వివాహం కాలేదు?" అని ఫ్లోరాను ప్రశ్నించాడు డాక్టర్.

దాని కామె అవునని సమాధానం చెప్పింది ఫ్లోరా తల్లి కాబోతున్నదని డాక్టర్ అభిప్రాయపడ్డాడు కానీ, తన అనుమానాల్ని గురించి ఆమెతో చెప్పలేదు ముందు వెనుకలు ఆలోచించకుండా అతను బెడ్‌ఛాంబర్‌లో ఉన్న స్త్రీలలో ఒకామెకు ఈ విషయాన్ని చెప్పాడు రహస్యంగా.

కొన్ని గంటల్లో ఫ్లోరాను తీక్షణమైన చూపులు వెంటాడటం మొదలెట్టాయి డాక్టర్ చెప్పిన దానికి బలాన్ని చేకూరుస్తున్నట్లు ఫ్లోరా స్కాట్‌లెండ్ నుంచి వచ్చేటప్పుడు ఆమె వెంట రాణి తల్లిగారి కార్యదర్శి సర్ జాన్ కాన్‌రాయ్ కూడా ఉన్నాడనే ఆధారాలు దొరికినయి.

క్రమక్రమంగా ఈ పుకార్లు రాణిగారి చెవికి సోకినయి వివరాల్ని తెలుసుకోకుండానే ఫ్లోరాగర్భవతని రాణి నిశ్చయించుకున్నది, 'దీన్ని గురించి ఏదో ఒకటి ఆలోచించాలి' అని అనుకున్నది ఏమైనా సరే ఫ్లోరాను ఉద్యోగంనుంచి తొలగించాలనుకున్నది రాణి. వెంటనే ప్రధానమంత్రి వద్దకు ఈ విషయాన్ని గురించి చెప్పేందుకు ఒకామెను పంపింది ప్రధానమంత్రి లార్డ్ మెల్బర్న్ కోర్టులో ఉన్నవా రందరిని ప్రశాంతంగా ఉండమని హెచ్చరించాడు. డాక్టర్ జాన్‌ని పిలిపించి ఫ్లోరా విషయం అడిగాడు.

తానే విషయమైనా నిశితంగా పరీక్షించనిదే తేల్చి చెప్పనని డాక్టర్ ఖచ్చితంగా చెప్పాడు. దాంతో ఫ్లోరా మీద నిందా ప్రచారం యిదివరకటికంటే ఎక్కువైంది.

రహస్యంగా వివాహం చేసుకున్నట్లు చెప్పమని డాక్టర్ ఫ్లోరాకు సలహా యిచ్చాడు తన సలహా పాటిస్తే వచ్చిన అపవాదు మాసిపోతుందనీ, రహస్య వివాహం అయిందా కాలేదా అన్న అనుమానం ఎవరికీ రాదనీ చెప్పాడు డాక్టర్ జాన్. వీటన్నింటికీ ఫ్లోరా మాత్రం ఒప్పుకోలేదు తాను గర్భవతి కాదనీ, తన ఆరోగ్యం ఇదివరకటికంటే మెరుగ్గా ఉందని చెప్పినా గూడా డాక్టర్ వినిపించుకోలేదు

'మీకలా అనిపిస్తున్నదేమోగానీ నాకు మాత్రం మార్పు రోజు రోజుకీ బాగా తెలుస్తూనే ఉంది' అని విసుక్కున్నాడు డాక్టర్. తనకే కాక కోర్టులో ఉద్యోగం చేస్తున్న మిగతా స్త్రీల అభిప్రాయం కూడా అదేనని చెప్పాడు డాక్టర్.

ఇదంతా రాణికి తెలిసింది. ఈ అపవాదు నిజంకాదని రుజువుకాకపోతే ఫ్లోరా జీవితం నాశనమౌతుందనుకొని రాణి ఆ విషయం తేలేదాకా ఫ్లోరాను కోర్టుకి రావద్దని రాణి ఆజ్ఞాపించింది ఫ్లోరాని గురించిన ఈ పుకార్లతోనే బకింగ్‌హామ్ పాలెస్ మారోమ్రోగింది. ప్రజల్లో ఫ్లోరా భవిష్యత్తు ఏమిటన్న విషయం వివాదాస్పదమైంది. డాక్టర్ సర్ జాన్‌ని కూడా ఫ్లోరా విషయం తేలేదాకా కోర్టుకి రావద్దని కోరింది డచెస్.

ఫ్లోరా మళ్లీ పరీక్ష నిమిత్తం సర్ జాన్ వద్దకి వెళ్లింది. కానీ వెళ్లేప్పుడు తను ప్రత్యేకంగా నియమించుకున్న వేరొక డాక్టర్‌ని సాక్షిగా తీసుకెళ్లింది

ఒక గంట తర్వాత విజయ గర్వంతో చేతిలోని సర్టిఫికేట్‌ని వూపుకుంటూ బయటికి వచ్చింది మిస్ ఫ్లోరా.

'ఫ్లోరా ఇప్పుడుగానీ, ఇదివరలోగానీ గర్భం ధరించిన సూచనలు లేవు' అని ఆ సర్టిఫికేట్‌లో ఉంది. కాలేయ¬నికి సంబంధించినజబ్బువల్ల ఆమె అలా కనిపించిందని చెప్పారు వైద్యులు ఈమెను గురించి దుష్ప్రచారం చేసిన వారందరూ తమ క్షమాపణలను సవినయంగా తెల్పుకున్నారు రాణిగారు కూడా కన్నీళ్లతో జరిగిందానికి తాను చాలా విచారిస్తున్నాననీ, వేరేవిధంగా అనుకోవద్దని చెప్పింది. దాంతో ఫ్లోరాకు తన వంశ గౌరవం, అంతస్తు గుర్తుకొచ్చి తీవ్రంగా సమాధాన మిచ్చింది 'రాజ్యాంగం చేత ఈవిధంగా అవమానింప బడ్డ మొదటి, చివర హేస్టింగ్స్‌ని కూడా నేనే'

విషాదాంతమైన ఉప కథని కూడా దీనితో బాటు చేర్చాల్సి ఉంది—

లండన్ ప్రజానీకంచే కొనియాడబడిన ఫ్లోరా కొన్ని వారాల్లో జబ్బు మళ్లీ తిరగబెట్టి కన్నుమూసింది. ఆమె కుటుంబంలోని వారు 'శవ పరీక్ష' జరిగి తీరాలన్నారు. లివర్ సంబంధమైన జబ్బుతో ఆమె మరణించిందని డాక్టర్లు తేల్చారు ఇది విన్న వెంటనే ప్రజలకు రాణీగారిపై తీవ్రమైన కోపం వచ్చింది.

'రాజ్యాంగంచే దోషిగా నిరూపింపబడింది', 'దుష్ప్రచారానికి బలైంది' అన్న కరపత్రాలు పంచిపెట్టారు ప్రజలు

బకింగ్‌హామ్ పాలెస్‌నుంచి ఫ్లోరా శవాన్ని ఉత్తరక్రియలకు తీసుకెళ్లేదారిలో జనం బారులుతీర్చి రోడ్డుకిరుప్రక్కలా నిలబడ్డారు. రాణీగారు తనుకూడా అనుసరించానన్న లాంఛనగా తన శకటాన్ని వెంట పంపింది కోపంలో ఒళ్లు తెలీని ప్రజలు ఆ బండిని రాళ్లతో కొట్టి గుర్రాలనూ, బండినీ వేరుచేసి తమ కసి తీర్చుకున్నారు.

వాళ్లల్లోని ఆ కోపం క్వీన్ విక్టోరియాకి, ప్రిన్స్ ఆల్బర్ట్‌కి వివాహం నిశ్చయమైందాకా అలాగే ఉంది.

(సశేషం)



... అమ్మ ... టపాటి పెట్టించావే మొగుడికి!!!

B2/BBC-6C TEL

## ఉత్సాహం, ఉల్లాసం కలిగించేది అంటేనే కాఫీ,
## దానిలో ఎన్నుకునేది

# బ్రూక్ బాండ్ కాఫీ

ఇతరమైన వాటికంటే బ్రూక్ బాండ్ విశేషమైనదనడానికి కారణాలేమిటి? బ్రూక్ బాండ్ కాఫీ పొడి పొట్లం విప్పండి. మీకే తెలుస్తుంది. కాఫీ విత్తులను అప్పటికప్పుడే వేయించి తయారుచేసినట్టి కమ్మని మంచివాసన వేస్తుంది.

ఏరికోరి కూర్చిన మేలిరకం కాఫీ విత్తులే బ్రూక్ బాండ్ కాఫీ పొడి తయారులో ఉపయోగించబడుతున్నవి....తర్వాత ఆ కమ్మని వాసన తగ్గకుండా గాలి చొరని సెలిఫాన్ సంచులలో శాస్త్రీయ పద్ధతులపై ప్యాక్ చేయబడుతుంది. ఇప్పుడే బ్రూక్ బాండ్ కాఫీని ప్రారంభించండి....ఆ తాజా, కమ్మని వాసనే శాశ్వతం చేసుకోండి.

---

మీరూ, బ్రూక్ బాండ్ కలిసి కప్పు మంచి కాఫీ తయారు చేయగలరు.
ఎల్లప్పుడూ తాజాగావుండి కమ్మనివాసన కలిగి ఉండేదానిని రుచిచూడండి.



# వంటలు

## జీడిపప్పుతో కొన్ని రకాలు

జీడిపప్పుకి ఉన్న రుచి ఇంక దేనికీ ఉండదేమో జీడిపప్పు ఉత్తినే తినటమే కాకుండా దానితో అనేక రకాలుగా వంటలు తయారు చేసుకోవచ్చును. నాకు తెలిసిన వాటిలో కొన్ని రకాలు చెబుతాను

## జీడిపప్పు హల్వా

కావలసినవి —

ఒక అర్ధశేరు జీడిపప్పు
ఒక అర్ధశేరు పాలు
అర్ధశేరు పంచదార
పావుశేరులో సగం (అర్ధపావు) నెయ్యి

ముందు జీడిపప్పు నీళ్లలో కడిగి శుభ్రంచేసి ఉంచుకోవాలి. కమ్మటి వాసన వచ్చే నెయ్యి ఉంచుకోవాలి. రోలు, వస్త్రం శుభ్రంగా కడిగి ఆ రోటిలో జీడిపప్పు అర్ధశేరు పాలల్లో కొద్దిగా పోస్తూ పప్పు మెత్తగా రుబ్బుకోవాలి. పప్పు అంతా అలా మెత్తగా కాటుకలా రుబ్బిన తర్వాత ఒక గిన్నెలోకి ఆ ముద్ద అంతా తీసేయాలి రుబ్బుతున్నప్పుడు వేయగా పాలు ఇంకా మిగిలిపోతే ఆ పాలు ఈ ముద్దలో వేసేయాలి పొయ్యి మీద స్టీలుగిన్నె పెట్టి అందులో కొద్దిగ నెయ్యి వేయాలి. ఆ నెయ్యి మరిగిన తర్వాత ఈ రుబ్బి ఉన్న జీడిపప్పు ముద్ద వేసి అట్లగరిటతో అడుగంటకుండా కలుపుతూ ఉండాలి అలా కొంతసేపు కలిపేసరికి పంచదార కరిగిపోతుంది అప్పుడు మరి కొంచెం నెయ్యి వేసి కలపాలి. పొయ్యిమీద పెట్టిన మొదలు దించేవరకు కలుపుతూనే ఉండాలి లేనట్లయితే అడుగు మాడిపోయి హల్వా మాడు వాసన కొడుతుంది. అందుచేత ఏమరకుండా కోవా త్రిప్పేటట్లు అలా కలుపుతూనే ఉండాలి కొంతసేపు ఉడికేసరికి హల్వా రంగు వస్తుంది మిగిలిన నెయ్యి కూడా వేసి బాగా కలుపుతూ ఉండాలి హల్వా దగ్గరగా అయ్యేవేళకి ఇంత స్పూను తో కి తీసుకుని అది చల్లార్చి చేతికి రాసుకుని ఆ హల్వా దగ్గరగా ముద్దలా అయిందీ లేనిదీ చూసుకోవాలి చేతికి అంటుకోకుండా దగ్గరికి ముద్దలా వచ్చేటట్లయితే హల్వా పాకం సరిగా వచ్చిందన్నమాట. అలా వచ్చినదానిని దించేసి ఒక ప్రక్కగా పెట్టుకుని అయిదు నిమిషాలు పోయిన తరువాత చూస్తే మనం ఎంత నెయ్యి వేస్తామో అందులో సగం నెయ్యి హల్వా గిన్నె చుట్టూ పైకి తేలిపోతుంది ఆ నెయ్యిని యింకో గిన్నెలోకి తీసేసి పళ్లానికి నెయ్యి రాసి ఈ హల్వా ఆ పళ్లెంలో పోసుకోవాలి బాగా చల్లారిన తర్వాత తింటే కమ్మగా ఉంటుంది. బాదంహల్వా తర్వాత చెప్పుకోదగ్గ హల్వా ఇదే ఇదేవిధంగా ఇవే కొలతల ప్రకారం పెసరపప్పుతో కూడా చేస్తారు. అయితే దీనికి వచ్చేటట్లుగా దానికి అభిరుచి నెయ్యి లాడు అంతే తేడా. అది కూడా చాలా బావుంటుంది ముఖ్యముగా గమనించవలసిన విషయాలు ఏమిటంటే ఈ హల్వా చేసిన వెంటనే కదపకుండా ఒక ప్రక్కగా అయిదు నిమిషాలు ఉంచేయాలి. అలా అయితేనే నెయ్యి వచ్చేస్తుంది. పాకం సరిగా చూడాలి. ఎక్కువగా వస్తే హల్వా గట్టిపడిపోతుంది. లేతపాకం తీసేస్తే వేళ్లకి అంటుకుంటుంది. అందుచేత జాగ్రత్తగా చూడాలి. ఇదివరకూ కమ్మగా ఉంటుంది. హల్వా చేస్తున్నప్పుడు పొయ్యివి విసర కూడదు అలా విసిరినట్లయితే పొయ్యిలోకి బుగ్గి అంతా పడి హల్వా నల్లగా అవుతుంది. హల్వా ఉడికేసరికి ఒకేవిధమైన రంగులో ఉంటుంది గనుక దీనికి వేరే ఇంకే రంగులూ వెయ్యక్కర్లేదు జీడిపప్పుతో చేస్తున్నాము కాబట్టి హల్వాపైన ఇంకేపప్పు వేయకూడదు. అర్ధశేరు ఒకేసారి చేసేయకుండా అందులో నాలో వంతు (అర్ధపావు) చేసుకుని మీకు నచ్చేటట్లయితే అప్పుడు ఎక్కువగా చేసుకోవచ్చు

## జీడిపప్పు మిఠాయి

కావలసినవి --

1 వీశ పంచదార
రెండు శేర్లు జీడిపప్పు

జీడిపప్పు తొక్కు తీసేసి మాడిపోయిన పప్పు కూడా తీసేసి రెండు పేర్లు పప్పు కొలుచుకుని సిద్ధంగా ఉంచుకోవాలి ఒక గిన్నెలో వీశ పంచదార అందులో వేసి ఒక గ్లాసు నీళ్లుపోసి పొయ్యిమీద పెట్టాలి. కొంతసేపటికి పంచదార కరిగిపోతుంది అలా పంచదార కరిగి బాగా పాకం మరుగుతున్నప్పుడు రెండు చెమ్చాల పాలు ఆ పాకంలో వెయ్యాలి. పాలు పాకంలో వేసిన రెండు నిమిషాలకు పంచదారలో ఉన్న మకిలి అంతా పైకి తెప్పలా తేలిపోతుంది అది అంతా తీసి పారేయాలి పాకం ముదరగా రానివ్వాలి. రెండు వేళ్లలో పాకం పట్టుకుచూస్తే తీగ బాగా తెగిపోవాలి దానినే ముదర పాకం అంటారు అలా పాకం వచ్చిన తరువాత జీడిపప్పు సిద్ధంగా ఉంచుకున్నది తీసి కలియబెట్టి వెంటనే దించేయాలి. అయిదు నిమిషాలు పోయాక అర చేతులు రెండింటికి నెయ్యి రాసుకుని నిమ్మకాయ సైజులో ఉండలు కట్టుకుని ఒక పళ్లెంలో పెట్టి బాగా ఆరిన తరువాత ఒక డబ్బాలో వేసి గట్టిగా మూత వేస్తే నెల్లాళ్లు ఉన్నా చెడిపోకుండా ఉంటాయి

## జీడిపప్పు కేక్

అర్ధశేరు జీడిపప్పు
అర్ధశేరు పంచదార
ఒక టీ స్పూన్ నెయ్యి

జీడిపప్పు శుభ్రంచేసుకుని ఒక ప్రక్కగా ఉంచుకోవాలి అర్ధశేరు పంచదార ఒక గిన్నెలో వేసి అర్ధ గ్లాసు నీళ్లుపోసి కుంపటిమీద పెట్టాలి పాకం మరుగుతున్నప్పుడు పాలుపోసి పైన మకిలి అలా తీసేయాలి పాకం ముదరగా (తీగ బాగా తెగిపోవాలి) వచ్చిన తరువాత ఈ జీడిపప్పు వేసి బాగా కలియబెట్టి వెంటనే దించేసి ఒక కంచానికి చెమ్చా నెయ్యి రాసి అందులో ఈ పాకం వేసి ఒక ప్రక్కగా ఉంచుకోవాలి చల్లారిన తరువాత (గోరువెచ్చగా ఉన్నప్పుడు) ముక్కలుగా కోసుకుని ఒక సీసాలో ఉంచుకోవాలి. ఇవి నెల్లాళ్లకు పైగా నిలువ ఉంటాయి జీడిపప్పు ఉండలు చేయలేనివారు ఈ కేక్ చేసుకోవచ్చు రుచికి అదీ ఇదీ ఒకలానే ఉంటుంది కాని షేపు మటుకు తేడా ఉంటుంది అంటే ఉండలు అయితే వేడిమీదనే కట్టాలి ఈ కేక్ అయితే ఏ బాధ ఉండదు. ఈ కేక్ చేసుకోవడంలో మనకిష్టమైన ఆకారాల్లో కోసుకోవచ్చు

## జీడిపప్పుకూర

జీడిపప్పు, నీరుల్లిపాయలు (ఎర్రవి) పచ్చిమిరపకాయలు, మినపప్పు జీలకర్ర, ఆవాలు, కరివేపాకు తగినంత ఉప్పు, కాస్త పసుపు

దీనికి ఎండు జీడిపప్పు పనికిరాదు పచ్చి జీడి పిక్కలు తెచ్చుకుని అవి వలిచి పప్పు సిద్ధం చేసుకోవాలి ఉల్లిపాయలు సన్నగా ముక్కలుగా తరుగుకోవాలి గిన్నె కుంపటిమీద పెట్టి నెయ్యి వేసి ఆవాలు వేసి అవి చిటపట లాడాక, మినప్పప్పు వేసి అవి దోరగా వేగిన తరువాత, జీలకర్ర, పచ్చి మిరపకాయ ముక్కలు, కరివేపాకు వేసి తాలింపు బాగా వేగిన తరువాత ఉల్లిపాయ ముక్కలు వేసి ఇంకొంచెం నెయ్యి వేసి ఎర్రగా వేగిన తరువాత జీడిపప్పు ఒకసారి కలియబెట్టి, ఉప్పు కొద్దిగా పసుపు, కొద్దిగా నీళ్లు చిలకరించి మూత పెట్టాలి. కొంతసేపటికి నీళ్లు ఇగిరిపోయి అలా మెత్తగా అయిన తరువాత ఒకసారి పొయ్యిమీద ఉంచి దించేయాలి ఈ కూర అన్నంలోకి బావుంటుంది. రొట్టెలలోకి బాగుంటుంది

## జీడిపప్పువడలు

పావుశేరు పెసరపిండి పప్పు, అర్ధపావు (అర్ధ శేరులో సగం) జీడిపప్పు, తగినన్ని పచ్చిమిరప కాయలు, చిటికె సరిపడే ఉప్పు, డాల్డాగాని, నూనె గాని

పెసరపిండి అంటే పెసలు, ఎన్నో బియ్యం అప్పి వేసి విసిరిస్తారు దానినే పెసరపిండి అంటారు అటువంటి పెసరపిండి పావుశేరు ఒక పళ్లెంలో పోసుకోవాలి పచ్చిమిరపకాయలు, ఉప్పు మెత్తగా దంచేసి ఆ ముద్ద ఈ పిండిలో వేసి అర చెమ్చా జీలకర్ర బాగా నలిపివేసి ఆ పిండిలో వేయాలి ఒక చెమ్చా కారం కూడా వేసి జీడిపప్పు చిన్న ముక్కలుగా చేసి ఆ పిండిలో వేసి తగినన్ని నీళ్లుపోసి కలపాలి పొయ్యిమీద కళాయిగిన్నె పెట్టి అందులో డాల్డావేసి బాగా మరిగాక తర్వాత అరటి ఆకుకి నీళ్లుగానీ, నూనెగానీ రాసి నిమ్మకాయ సైజులో పెసరపిండి ముద్ద తీసి కొని ఆ ఆకుమీద అరచేతి మందంతో వత్తి (లక్ష్మీ దళసరిగా కాకుండా) మరిగిన డాల్డాలో వేసి రెండు వైపులా ఎర్రగా వేగనిచ్చి తీసేయాలి ఇవి చాలా రుచిగా ఉంటాయి ఇంటిలో ఇష్టమున్నవారు కొద్దిగా నువ్వు పప్పు కూడా వేసుకోవచ్చు జీడిపప్పు ముక్కలుగా చేసి వేయాలి లేకపోయితే ఎడమ లద్దినట్లుగా ఉండదు

## జీడిపప్పు పచ్చడి

జీడిపప్పు, నిమ్మకాయ, మిరపకాయలు, ఉప్పు, పసుపు, నెయ్యి—నెయ్యి మరిగిన తర్వాత మిరపకాయలు వేసి అవి ఎఱ్ఱగా వేగిన తర్వాత జీడిపప్పు వేసి కలపాలి. రోలు శుభ్రంగా కడిగి రోటిలో ఈ పప్పు (వేచినది), మిరపకాయలు, ఉప్పు, పసుపు వేసి, కొద్దిగా నీళ్ళు చిలకరించి మెత్తగా రుబ్బుకోవాలి. పచ్చడి మెత్తగా రుబ్బిన తరువాత బాగా కలియబెట్టి మరోసారి రుబ్బి తీసేసి అందులో మనం తినే పులుసుబట్టి నిమ్మరసం పిండుకోవాలి. దీనికి పోపు మినప్పప్పు, ఆవాలు ఈ రెండే. ఇంకేం వేయరు. ఇది మామూలు జీడిపప్పుతోనే చేస్తారు. పచ్చి పప్పుతో కాదు. ★

-టి. భూమాదేవి.

## వనితావాణి

### వివాహము-స్వేచ్ఛ

"వివాహము స్వేచ్ఛ పై మయూరాక్షిగారు వ్రాసింది చదివాను. ప్రేమించి పెళ్లి చేసుకోవటమే మంచిదన్నారు. పెద్దలు వారికి స్వేచ్ఛ నివ్వాలని వ్రాశారు. కాని ప్రేమించి పెళ్లి చేసుకున్న వివాహాలలో ఎంతవరకు వారి దాంపత్యం సుఖప్రదమవుతుందనేది తెలియజేయలేదు. ఆమధ్య వనితావాణిలో ఒక సోదరి ప్రేమించి పెళ్ళి చేసుకున్న తరువాత భర్త తనను సరిగా చూడటం లేదని ఆ విషయం తల్లి దండ్రులకు, తోబుట్టువులకు తెలిపితే, నీకేమ్మా? ప్రేమించి పెళ్లి చేసుకున్నావు. ముందు మేము చెబితే విన్నావా! నీ అగచాట్లు నీవు పడు మాకు చెబితే మేమేమి చేస్తాం. ఆ సంగతి నీ భర్తనే అడిగి ఒక పరిష్కారానికి రండి'' అన్నారు. అదే పెద్దలు నిర్ణయించిన వివాహమైతే భర్త భార్యను అలా చూస్తుంటే పూర్కుంటారా! ప్రేమించి పెళ్ళి చేసుకోవటంకంటే పెద్దలు నిర్ణయించిన వరుడ్నే వివాహం చేసుకోవటం యువతుల కనీస ధర్మమని నా అభిప్రాయం.

కుమారి కమల (ఆత్మకూరు)

### కలహాలు-కారణాలు

'వనితాలోకం'లో 26—2—65 ని ప్రచురించిన 'కలహాలు—కారణాలు' వ్యాసం చదివాను. రాధగారు వ్యాసం మొదలుపెట్టేటప్పుడు "కలహాలు సాధారణంగా మనలో వస్తూనే ఉంటాయి" అని రాసారు. తరువాత ఆవిడ కేవలం భార్యాభర్తల కలహాలకు కారణాలు మాత్రమే వివరించారు. స్నేహితులమధ్య కలహాలకు కూడా కారణాలు వివరిస్తారనుకొని. చదివిన నాలాటివారికి నిరుత్సాహం కలిగించింది ఆ వ్యాసం.

ఇంద్రకంటి విజయ (ఏలూరు)

# సంపెంగలూ సన్నజాజులూ




జ రి గి న క థ

మంజుల వివాహం కోసం కట్నం తీసుకొని కొడుకు పెళ్ళి చేస్తాడు తండ్రి. తర్వాత మంజుల వివాహం అవుతుంది. సహృదయం గల అన్న చెల్లెల్ని చదువుకోమని సలహా యిస్తాడు. ఆరేళ్ళు గడిచేప్పటికి బి. య్యే. పట్టాతో బాటు నాలు గేళ్ల మధురిమను కూడా పొందుతుంది మంజు. ఎం. ఏ. పరీక్షకు బలవంతంచేసి భర్తని ఒప్పిస్తుంది. కానీ ఆమె పాసవుతుంది, భర్త ఫెయిలవుతాడు తనకు చదువు మీద శ్రద్ధ లేదని చెప్తాడు. ఫైనల్‌కి వెళ్లా లనుకొన్న మంజుకు మొదట ఆశాభంగం కలిగినా తర్వాత ఉద్యోగం చేయననే ఆమె షరతుకు వొప్పుకుని అంగీకరిస్తాడు భర్త మంజు అన్నయ్య సంసారం కుంటుపడుతుంది న్యాయం పేరుతో ఉద్యోగాన్ని వదులుకునే స్థితికి వస్తాడు ప్రసాదరావు. భర్తకు తెలీకుండా తన నగను అమ్మి అన్నయ్య అప్పును తీరుస్తుంది మంజు ఇంటికి తిరిగి వచ్చిన మంజు, భర్త ఎక్కువ డబ్బు ఖర్చు చేస్తున్నట్లు, అప్పులు చేసినట్లు తెల్సుకుంటుంది.

## 14

ఏళ్ల తరబడి మా సంసారం హాయిగా సాగిపోడానికి అన్నిటికంటె ముఖ్య సూత్రం ఒకళ్ళ ఖర్చులు మరొకరు తెలుసుకుందామనే కనీసపు కోరిక కూడా లేకపోవడమే అనుకుంటాను ఆయన ఎప్పుడు తెచ్చేవారో ఎక్కడ తెచ్చేవారో పర్సు నిండా ఎప్పుడూ నోట్లూ చిల్లరా ఉండేవి నేను అందులోంచి తీసుకున్నప్పుడు కూడా ఆయనకు చెప్పవలసిన అవసరం లేకపోయేది.

'ఇందులో ఇంత ఉండాలి, కనపడదేం, ఏం చేశావ్' అని వారు ఒక్కసారయినా నన్ను అడిగితే కదా! పైగా అనేవారు పెద్ద వేదాంతిలా. 'ఎన్నాళ్లు ఉంటామో, ఎప్పుడు వదిలి వెళ్ళిపోతామో ఎవరికి తెలుసు ? ఉన్నన్నాళ్ళు రెండు చేతులా ఖర్చు పెట్టకపోతే, కొవ్వొత్తి రెండు వైపులా వెలిగించి ఆనందించకపోతే కూడా పట్టుకుపోతామా ? ప్రపంచంలో యింత కలిగి ఉండడమే ఒక అదృష్టమైతే దాన్ని ఖర్చుపెట్టుకుని సుఖించే అరుదైన లాభాన్ని ఎందుకు పొందకూడదు ?' ఇలా ఉండే ఆయన కబుర్లు మొదట చిత్రంగా కనుపించినా తరువాత నాకు సహజమై పోయాయి అలాగని ఒళ్ళు తెలియకుండా కనబడినవన్నీ కొనేసే ఖర్చు దారి మనిషి కాదు మాట్లాడితే, 'మూడు ఏళ్ళైలు ఎవడు బతికాడులెద్దూ! మూడు ఎకరాలు మాత్రం మహా ఎంతమంది సంపాదిస్తున్నారు చెబుదూ!' అనేవారు. అనవసరంగా వాదించడం లేనిపోని అల్లర్లు కొని తెచ్చుకోడం నాకే యిష్టం లేకపోయింది బ్యాంక్ ఎకౌంటు ఓపెన్ చేయించాలని మాత్రం చాలాసార్లు చెప్పి చూశాను. 'ఇవాళ వెయ్యడం రేపు తియ్యడం' యీ 'ఇస్తినమ్మ వాయనం పుచ్చుకొంటి వాయనం' గొడవ కూడా ఎందుకూ ? అన్నీ భరించడానికి పర్సు ఉండనే ఉంది. ఇదో కొత్త సొద కూడా ఎందుకూ!' అనేవారు. ఎదురుచెప్పడం యిష్టం లేక వూరుకునేదాన్ని, అప్పుడప్పుడు ఏవైనా చిన్న చిన్న యిబ్బందులు వచ్చినా సెకండ్లమీద డబ్బు తెగలిగే వారుండగా నా కెందుకీ లేనిపోని విచారం అని సరిపెట్టుకునేదాన్ని. ఇక మధురిమ విషయంలో నరేసరీ టాయ్ సెంటర్‌లోకి ఏ కొత్త వస్తువు వచ్చినా యింట్లో ఉండవలసిందే రెండ్రోజులకైనా ఓ కొత్తరకం గౌను తేవలసిందే. నేనిప్పుడేనా ఎందుకింత ఖర్చు చేశారంటే యిద్దరూ కలసి నామీద యుద్ధానికి వచ్చేవారు, అది గోళ్ళతో నన్ను బరికేసేది కూడా నేనే ఓడిపోయి ఊరుకునే దాన్ని. మొత్తమ్మీద అతిముఖ్యమైన ఆర్థిక బాధలేకుండా ఉల్లాసంగా సల్లాపంలా మా సంసార నౌక యిన్నాళ్లూ గడచి పోయింది ఇటువంటి విషయాలు యిదివరకే నేను పట్టించుకునేదాన్ని కాదు. ఈ రెండేళ్ళూ యీ చదువొకటి వచ్చి పడడంతో మామూలు నిషా కూడా ఉంచలేదు. ఇంటికి కావలసింది తేవడం, ఖర్చు పెట్టడం— ఈ రెండూ ఆయన చెయ్యకపోతే నేనీ సారస్వత సాగరాన్ని యీదుకు రాగల్గుతానా !

'మునపట్లా, కాదక్కా నువ్వు! ప్రతీ విషయం గంటలతరబడి ఆలోచించడం నేర్చుకున్నావు— ఎదురుగుండా మనుషులు కూచుని ఉన్నా సరే' నేను ఉల్లిపడి యిటు తిరిగింది ఏదో మాట్లాడ్డానికి ప్రయత్నించాను.

'ఆఁ ఏమిటీ, కామేశ్వరి వదిన ఖర్చు గురించా చెబుతున్నావ్ ? ఈ విషయంలో ఆయన మాత్రం ఏం తక్కువ తిన్నారా ఏమిటి సరళా! సినిమాకు వెడితే హైయ్యెస్టు క్లాసు కొనుక్కుంటే గాని నామోషి ఆయెను'.

'సరే బావ సంగతి నాకు తెలియందా! కాని కామేశ్వరి ఖర్చుకీ అతని ఖర్చుకీ పోలికే లేదు నువ్విక్కడ లేనప్పుడు ఆవిణ్ణిక్కడికి పిలిపించడం నాకేం నచ్చలేదు సుమా! నువ్వేమనుకుంటే అది అనుకో, ఆ విషయంలో మీరు చాలా పొరపాటు పని చేశారని నా ఉద్దేశం'

'పోన్లే, ఆవిడిప్పుడు వెళ్ళిపోయిందిగదా!'

'అంతటితో అది ఆగిపోతే సంతోషమే! ఏమైనా ఆవిడ గురించి నీ అభిప్రాయం సరైనది కాదని నా నమ్మకం లేకపోతే ఆమె గురించి నీకు సరిగ్గా తెలియనే తెలియదేమో!'

సరళ యిలా మాట్లాడ్డం చూసి నే నాశ్చర్యపోయాను నాకంటే ఆవిడ కెక్కువ తెలిసిం దేమిటో నా కర్థం కాలేదు

'ఏదీ, యిదివరకు ఏమీ తోచక మీ గుమ్మంలోకి వస్తే మాట్లాడేదానివే కాదు! ఎక్కడ నీ టైం వేస్టయిపోతుందో అని అలా కూచునే దానివి గాని ఎక్కువగా కబుర్లలోకి దిగేదానివే కాదు. ఇప్పుడు మరేం అడ్డు లేదు గనుక నీతో ఒకటి చెప్ప బుద్దేస్తోంది'

'ఇంతకీ మా కామేశ్వరి గురించి నీ కెక్కువేం తెలుసూ ?'

'మా పుట్టింటివారు మద్రాసని యిదివరకు ఓసారి నీతో చెప్పినట్లు జ్ఞాపకం కిందటిసారి కామేశ్వరి యిక్కడికి వచ్చినప్పుడు వారి పుట్టింటివారి భోగ భాగ్యాలను పొగిడి వాళ్ల ఇంటికి నేనక్కడికి వచ్చినప్పుడు రమ్మని మరీ మరీ చెప్పింది. ఆమధ్య మా నాన్నగారి వంట్లో బాగులేదని ఉత్తరం వస్తే మద్రాసు వెళ్లేగా! తీరా కనుక్కుంటే వాళ్ల యిల్లు ఆ వీధిలోనే అని తెలిసింది. రెండు మూడుసార్లు నేను వాళ్లింటికి వెళ్లి రావడం జరిగింది.'

'సరే కవళమ్మగారి జబ్బు గురించి ఆరంభిస్తావు కాబోలు. విని విని ఇప్పటికీ చెవులు తడికలు కట్టి పోయాయి!' సరళ నవ్వింది.

'నాకు తెలిసిన విషయాలు కామేశ్వరి గురించి. ఆవిడ అమ్మగారు సరేసరి అసలు కామేశ్వరికీ నాకూ ఇంతగా కలసిపోడానికి కారణ మేమిటో నీకు తెలుసా ? నేను చదువుకున్నదాన్ని కావడం ఆవిడకి నామీద అపరిమితమైన మోజు'

'అదేమిటి చిత్రం ?'

'అదే మరి ఆవిడ మొగుడు గరవయ్య ఆమెను అస్తమానూ చదువూ సంధ్యా లేని మొరటు మనిషివని సాధించి పోస్తూంటాడుట. ఆఖరికి తెలుగులో కూడా భార్య తప్పులు లేకుండా రాయలేదని, యింతకంటే చావడం మంచిదని, అడ్డమయిన మాటలూ ఆడపోస్తూంటాడట. ఆ హింస పడలేక ఆవిడ మెట్రిక్‌కి కడితే అన్ని సబ్జక్టుల మార్కులూ కలిపి ఒక సబ్జకులో వచ్చే పాసు మార్కు కూడా దాటలేదట! ఆ మార్కులు చూసి నలుగురి మధ్యా చిన్నబుచ్చి గవరయ్య వీలైనన్ని విధాల ఏడిపించాడట అప్పట్నుంచీ యీ విడకి తనకి రాకపోడం మాట అటుంచి చదువుకున్నవాళ్ళని చూస్తే విపరీతమయిన కసీ, ఈర్ష్యాను. మొగాళ్లే తప్ప ఆడ

వాళ్ళు చదువుకోడానికి అనమర్హులూ, అనర్హులూ అనీ, ఒకవేళ అలా కాక పరీక్షలు ప్యాసైతే ఎవళ్ళచేతో ఏదో రెకమండేషన్ చేయించుకునో, డబ్బు ఖర్చుపెట్టి మార్కులు వేయించుకునో ప్యాసై ఉంటారని ఆమె దృఢమైన నమ్మకం. అందుకనే చదువుకున్న ఆడవాళ్ళని చూస్తే ఆవిడకు మాత్రం ఏవిధంగానూ మంచి అభిప్రాయం లేదు. ఈ విషయాలు చాలావరకూ నాకు వసుంధరే చెప్పింది. ఆమె నిన్ను ఎరుగునటగా !'

'ఆఁ మేమిద్దరం చిన్నప్పుడు కలసి చదువుకున్నాం.'

'వసుంధర బియ్యే ప్యాసైందని విని కామేశ్వరి ఆవిడతో మాటలు మానేసిందట !'

'పోనిద్దూ, ఎవరి వెర్రి వాళ్ళ కానందం' అన్నాను ఏమనాలో తోచక.

'అలా అయితే బాగానే ఉండును. చదువుకున్న ఆడవాళ్ళు మొగాళ్ళ మాట వినరనీ, రేప్పొద్దున ఏదైనా ఉద్యోగం చేస్తే ఎదిరిస్తారనీ బావతో ఎన్నిసార్లు నీ గురించి హెచ్చరించేదో వినలేకపోయే వాళ్ళం మేం. బావ మంచివాడు కాబట్టి సరిపోయింది గాని ......'

'ఆయన మంచితనం నువ్వేం చూశావేం ?'

సరళ నవ్వేసి ఊరుకుంది. ఏం మాటాడ లేదు.

'పోనీ, ఆవిడ బోధలు విని ఆయన ఏమనే వారు ?'

'ఏమీ మాటాడేవారు కాదనుకుంటాను. మాకేం వినబడేది కాదు. ఎంత వినిపించుకోనివారైతే మాత్రం అస్తమానూ అదే పనిగా ఎక్కిస్తూంటే కొంచెమైనా మార్పు కలుగుతుం దంటావా, కలగ దంటావా ?'

నా మనసు తీవ్రంగా ఆలోచిస్తోంది. నగను అమ్మిన ముఖ్య విషయం ఇంకా వారి చెవిని వెయ్యనేలేదు. నిజంగా కామేశ్వరి ఆనాడే వెళ్ళిపోడం ఎంత అదృష్టమో ! భగవంతుడిలాగే ఎప్పటికప్పుడు ఏదోవిధంగా అడ్డుపడుతూ ఉంటాడు. లేకపోతే కేవలం సాధారణ మానవులం ఏమైపోతాం !

'ఇదంతా సరే—కామేశ్వరి యిక్కడికొచ్చి ఏదో ఖర్చుపెట్టేసిందంటావ్, ఆమాట కేమైనా అర్థముందా సరళా, ఆమెకేం లేదా, పోదా ?'

'అవునవును. అసలు విషయం మరచిపోయాను. కనబడిందల్లా కొనేస్తుందని గవరయ్య ఆవిడకట్టే డబ్బు యివ్వడట. కనకమ్మగారు ఎంత యిస్తే మాత్రం ఆవిడ చిరుతిళ్ళకు సరిపోతాయి? తెలిసి తెలిసి ఆవిడేదో సాయమని మీరు పిలిపించుకున్నారు గాని యిల్లాలు ఒక్కనాడైనా పొయ్యిలో నిప్పేసి ఎరగదు. అంతా హోటల్‌నుంచే దిగుమతి చేయించుకునేది. కాఫీకోసమనీ, ఐస్‌క్రీం కోసమనీ, ఆ ఫ్లాస్కు ఆవిడ ఉన్నంతకాలం క్షణం విశ్రాంతి ఎరగదు. ఏ రెండొందలు ఖర్చుచేసి వెళ్ళిందో మా తల్లి .... మళ్ళీ రాత్రి భోజనా లయ్యాక వస్తాను పనుంది.'

సరళ గబగబ వెళ్ళిపోయింది.

నేను ఆశ్చర్యపోయాను. 'సరళ ఇంతగా మాటకారి ఎప్పుడయిందా' అని కాదు. నాకు తెలియకుండా ఎన్ని విషయాలు జరిగిపోతున్నాయీ అని. ముఖ్య విషయాలలో అశ్రద్ధ వహించినందువల్ల వచ్చే కష్టనష్టాలన్నీ నేను అనుభవిస్తున్నాను. చదువు విషయంలో పూర్తిగా లీనమైపోయాను—ఆ రెండేళ్ళూ, బాగానే ఉంది, అతిముఖ్య విషయాల విషయంలో ఇంతటి ప్రమత్తతా ? రైలుకి వెళ్ళవలసిన మనిషి దారిలో మంచి మేజిక్ ప్రదర్శనం కనబడితే అందులో తలదూర్చి అక్కడే ఉండిపోతే ఏమౌతుంది ? రైలు వెళ్ళిపోదా ?

రెండ్రోజులు పోయాక వదిన దగ్గర్నుంచి



మధుర దగ్గర్నుంచి ఉత్తరాలు వచ్చేయి. వదిన ఉత్తరం విప్పడానికి వేళ్లు ఒణికాయి అన్నయ్య ఒంట్లో ఎలా ఉందో. మందూ అదీ సరిగ్గా పుచ్చుకుంటున్నాడో లేదో. 'నేను చదువుకోని దాన్ని. తెలివైనవాళ్లతో మెలగడం కష్టంగా ఉంది' అని వదిన అనడం బాగా జ్ఞాపకముంది ఉత్తరం చాలా చిన్నది. వదినే రాసింది.

చిరంజీవి సౌభాగ్యవతి మంజులకు—మీ వదిన అనేక ఆశీస్సులు. మీ రందరూ అచట క్షేమమని తలచెదను. నువ్వు వెళ్లిన తర్వాత భగవంతుని దయ వల్ల రోజురోజుకీ మీ అన్నయ్యగారికి ఆరోగ్యము చేకూరుతున్నది. మునుపటివలె కాక మందులు శ్రద్ధగా పుచ్చుకొను చున్నారు నీ సహాయమునకు అన్నివిధాలా కృతజ్ఞులము. —మంగళ

ఉత్తరం చదవగానే హృదయం ఆనందంతో కొట్టుకుంది. ఇంతకన్న కోరేది ఏముంది ? ఆప్తులకు ఆరోగ్యముకన్న పెద్ద పండుగ ఏముంది ? ఉత్తరం చివరి నుంచి ఈ చివరకు రెండు మూడు సార్లు చదివాను. అలా చదువుతూంటే ఒక పాడు ఆలోచన స్ఫురించి మనసు నంతటినీ కలవర పెట్టింది మొదట్లో మైమరపించిన ఉత్తరమే చదువుతున్నకొద్దీ అంతా కృత్రిమమైనదనీ, నా కన్ను గప్పడానికి రాయబడిందనీ అనిపించింది.

# సంపెంగలూ సన్నజాజులూ

'నీ సహాయమునకు అన్నివిధాలా కృతజ్ఞులము'. నిజంగా మనస్సా నేను చేసిన పనికి అన్నయ్య సంతోషించి ఉంటాడా ? 'అన్నయ్యా, వదినా, మీనుంచి నన్నెందుకు వేరు చేస్తున్నారు ? నానుంచి ఎందుకు దాచిపెడుతున్నారు ? అవసరం వచ్చినపుడు మీకు సహాయం చెయ్యడానికి నేను తగనా ? ఈ దీనురాలికి ఆమాత్రం అవకాశం కల్పించరా ?' అని నా మనసు రోదించింది. ఏం చెయ్యడానికీ తోచ లేదు. మరోసారి ఆ ఉత్తరం చదివాను. శుష్క విచారంవల్ల కలసివచ్చే దేముంది ? నేను వృధాగా భయపడుతున్నానేమో , అనిపించింది. కన్నీళ్లు తుడుచుకున్నాను. వీలయితే ఒకసారి వెళ్లి రావాలి. ఇప్పట్లో పడుతుందా ? మొన్న మొన్ననే వచ్చాను నేను లేకపోవడంవల్ల సంభవించిన అనర్థాలు అప్పటికే ఒకటీ ఒకటీ బయటపడుతున్నాయి కాల గర్భంలో దాగిన కష్టనష్టాలను ముమ్ముందు ఇంకా ఎన్నెన్ని ఎదుర్కోవలసి ఉంటుందో ! మరో పది నిముషాలు అలా పడుకుని ఉంటే నిర్మల జ్ఞాపకానికి వచ్చింది వెంటనే ఆ అమ్మాయి ఎడ్రసుకు ఒక ఉత్తరం రాశాను.

ప్రియ సోదరీ, నిర్మలా !

ఇక్కడకు వచ్చానన్న మాటే గాని నా మనస్సు అన్నయ్య దగ్గరే ఉంది. వాళ్లు ఏం యిబ్బందిపడుతున్నారో తెలుసుకోడానికి కూడా భయంగా ఉంది. అనారోగ్యంతోబాటు ఆర్థిక యిబ్బందులు కూడా జోడైతే ఎంతటి గట్టి మనస్సు ఉన్నవాళ్లయినా డీలా పడిపోతారు. ఉల్లాసం కలిగించే కబుర్లు వాడి రోగం మళ్లిస్తాయని డాక్టరు చెప్పేడు వాడి ప్రక్కని కూచుని తల నిమురుతూ ఏవేవో కబుర్లు చెప్పి కళ్ల నీళ్లు తెప్పించే దాకా నవ్వించాలని ఉంది వాడి రోగం తగ్గించడానికి నేనే సమర్థురాల్నని నా మనస్సు చెబుతోంది. కాని, పరాయి యింట్లో ఆశ్రయం పొందినదాన్ని. అస్వతంత్రురాల నైన ఆడదాన్ని నేనేం చెయ్యగలను ? చిన్న పిల్లవి, నీ కేవేవో రాసుకుపోతున్నానేమో? మరోలా అనుకోకు ఒక ముఖ్య విషయం నీ ద్వారా వింటేగాని నాకు సంతృప్తి ఉండదు ఇది వరకే ఆ నగ విషయంలో నా కెంతో సహాయంచేసి వయసుకి మించిన బుద్ధిమంతురాలివనిపించుకున్నావు. ఈ సంగతి కూడా రాసి దీనురాలయిన మీ అక్కయ్యకు సహాయం చెయ్యి.

మా అన్నయ్యకు ఎలా ఉంది ? మళ్లీ డాక్టరుకి చూపించారా ? వ్యాధి తగ్గుతోందా, హెచ్చుతోందా ? బ్లడ్ ప్రెషరు ఇప్పుడెంత ఉంది ? గుప్పెడన్నం తినగలుగుతున్నాడా ? కొన్ని గంటలయినా నిద్ర పోగలుగుతున్నాడా ? సహజమైన తెలివి తేటలు గల నువ్వు ఈ విషయాలు కనుక్కోడం అంత కష్టమైన పనేం కాదు మా వదిన ఎలా ఉంది ? పిల్లలిద్దరూ ఎలా ఉన్నారు ? ఈమధ్య వాళ్ల నుంచి ఉత్తరం వచ్చింది గాని అదెంతమటుకు నిజమో తెలియడంలేదు నిర్మలా !

తిరుగు టపాలో జవాబు రాస్తావని నా ఎడ్రసు గల కవరు ఇందులో పెడుతున్నాను. నీ జవాబు కోసం ఎదురుచూస్తున్నాను.

నిర్భాగ్యురాలు, మంజుల.

ఉత్తరం రంగిచేత పోస్టుకి పంపేశాను. ఆయన చాలాసేపై వచ్చారని గాని రెండవ కవరు చింపి చదువుతున్నారని గాని నేను చూడనేలేదు.

'చాలావరకూ వెళ్లిందే కధ ! ఇంకా నయం !' అన్నారు ఆయన ఆ ఉత్తరం పూర్తిచేసి మడిచి కవరులో పెడుతూ ఆ ఉత్తరం గురించి నే నేమీ అడగలేదు గాని వదిన ఉత్తరం ఆయన కిచ్చాను.

'నే చెప్పలేదూ, త్వరలోనే తగ్గిపోతుందనీ— అన్నీ లేనిపోని భయాలు నీకు ఒకవేళ అంతగా కాని రోగం వచ్చినా వయసులో ఉన్నాడు కనుక, ఇంకా రక్తబలిమి ఉంటుంది గనుక కొన్నాళ్లు బాధపడినా తగ్గిపోతుంది. అసలు ఇదివరకే తగ్గిపోను అతడెందుకు సరైన శ్రద్ధ తీసుకోలేదో గాని. నువ్వేం అలా ఉన్నావ్ ?' అన్నారు.

'ఏమోనండీ, ఉత్తరం చదివినకొద్దీ నాకు భయం ఎక్కువౌతోంది. వాళ్లు నా దగ్గర్నుంచి అసలు విషయం దాచిపెట్టారేమో అనిపిస్తోందండి.' ఆయన ముఖం చిట్లించారు.

'ఏడిసినట్టుంది. కులాసాగా ఉన్నారని రాసినా కుమిలి పోయేదాన్ని నిన్నే చూశాను. దేనికయినా 'అతి' పనికిరాదు. లేచి ఆ కన్నీళ్లు తుడుచుకో. అశుభం కూడాను ఇదిగో ఈ రెండో ఉత్తరం చూశావా, ఎంత చిత్రంగా ఉందో.'

(సశేషం)



డబ్బును అనవసరముగా ఖర్చుపెడుతున్నావేమిట్రా? కష్టపడి దోపిడిచేస డబ్బురా అది.

# మొక్కల




## వైజ్ఞానిక గాధాశతి

### 11

డాక్టర్

"ఎవరూ ?'

'లూధర్ బర్‌బాంక్సు'.

'వృక్షశాస్త్రజ్ఞుడా ?'

'వృక్షజ్ఞుడు, శాస్త్రజ్ఞుడు కాడు'

'వర్తకుడా ?'

'వర్తకానికి సాయపడ్డాడు కాని వర్తకుడు కాడు'

'మాంత్రికుడా ?'

'మంత్రాలు వేశినట్టే కనపడ్డాడు, మంత్రాలు మట్టుకు తెలియవు'

'ఏమిటి తెలుసును అతనికీ ?'

'బంగాళాదుంపలు కందమూలం దుంపలంతేశివి కాయించడమూ, పువ్వుల రంగులు మార్చడమూ, పళ్లు సైజు పెంచడమూ, ఏ చెట్టూ పూయని రంగుల చారలపూలు పూయించడమూ, కాపు త్వరగా తెప్పించడమూ, ఒకటేమిటి, ఇంతవరకు సృష్టిలో ఉన్న రకాల్ని పెంచి వాటిని వృద్ధి చేయుడమూ బాగా తెలుసును. అంతమాత్రం చెప్తే సొగసు లేదు అతనికే తెలుసును.'

'ఎలా చేశాడూ ? రాసాయనికవు ఎరువులు ఉపయోగించా ?'

'కాదు. లోపించిన గుణాల్ని వదిలంగా పైకి లాగి'

'మొక్కల్లో లోపించిన గుణాల్ని పైకి లాగేడా?'

'బంగాళాదుంపల విషయంలో అంతే చేశాడు. బంగాళాదుంపలు, కంద, చామ, పెండలము, అల్లము వంటి దుంపలు మొక్కలై పువ్వులూ, విత్తనాలూ పెట్టుతాయి.'

'విత్తనాలా.'

'ఆఁ. విత్తనాలే. కంద ఒక ఏడాదిలో దుంపగా పెరిగి, వచ్చే యేటికి కావలసినంత ఆహారము నిలవ చేసుకుంటుంది. మనము ఆ దుంపని తవ్వేసి వాడుకుంటాము. మళ్లీ మొక్కలు వెయ్యడానికి ఈ దుంపకి చుట్టూరా పొడుచుకు వచ్చిన పిలకలు విరిచి వాడుకుంటాము. దుంప అంటే కంద మొక్క కాండమే. కాండములో తల్లి మొక్క గుణాలే ఉంటాయి. కనక దుంప పిలకలకు మొదటి మొక్క గుణాలే, అంతే ఎత్తూ, విస్తృతి, పారే దుంప సైజూ, వస్తాయి.

కందమొక్కని అలాగ వదిలేస్తే రెండో యేడు మొక్క మళ్లీ వచ్చి, పూలు పూచి, విత్తనాలు పెట్టుతుంది. పూలు విత్తనా లవడానికి ఇతర పూవుల పుప్పొడి ఈ పూవు అండాశయాన్ని చేరాలి. అంటే విత్తనాలలో రెండు పూవుల గుణాల మిశ్రమ మౌతాయన్నమాట. దుంప పిలకలకు ఆ దుంపను తయారుచేసుకున్న మొక్క గుణాలే కనబడతాయి."

"కాయలు కాచే చెట్లలో పుష్పపరాగ సంపర్కము వల్లనే ఫలదీకరణము జరుగుతుంది గదా ? మరి కాయలు పాతితే పెద్ద పెద్ద కాయలు కాచే మొక్కలు రావేమి ?"

"దాని సంగతి తర్వాత చెప్తాను. బర్‌బాంక్సు 1862—63 సంవత్సరాలలో బంగాళాదుంపల్ని మొలవవేసి పువ్వులూ, విత్తనాలూ వచ్చేదాకా వదిలేడు. ఆ విత్తనాలతో మొలిపించిన మొక్కల నుంచి మంచి గుణాలు ఏవీ విశేషంగా రాలేదు. చివరికి గులాబీబంగాళాదుంప విత్తనంతో వచ్చిన మొక్కలో కందమూలం దుంపలంతేసి బంగాళా దుంపలు వచ్చాయి. అలాటి విత్తనము ఎవరు తెచ్చినా పాతిక రూపాయ లిస్తానని ప్రకటించాడు బర్‌బాంక్సు. ఎవరికీ లభించలేదు'

'అసలు అతనికి ఆ విత్తనము ఎలాగు దొరికింది?

'గులాబీ బంగాళాదుంప, విత్తనాలు పెట్టదని బర్‌బాంకుకి తెలుసును. కనుక విత్తనము ఏర్పడ్డ దగ్గరనుంచి పండు అయ్యేవరకూ దానిని జాగ్రత్తగా గమనించాడు. విత్తనము చిన్న రవ్వ. అంత చిన్న విత్తనాల నుంచి వచ్చిన మొక్కలలో ఒకటి పెద్ద పెద్ద దుంప లిచ్చింది. బర్‌బాంకు దుంప లన్నారు వాటిని. నాలుగున్నర అంగుళాలు పొడవూ రెండంగుళాల దళసరీ ఉన్నాయి అవి.'

'అన్ని దుంపలూ అలాగ పెంచవచ్చునా ?'

'సోదా చూడాలి. మన చామ దుంపలూ, కంద మూలాలూ, అల్లమూ చూడవచ్చునేమో'

'ఎన్నాళ్లు పట్టుతుంది ?'

'ఎవరు చెప్పగలరూ ? దుంప మొక్కల విత్తనాలు రావడమే రెండేళ్లు పట్టుతుంది. ఆ విత్తనాల మొక్కలకి దుంపలు రావడానికి మరో యేడు వాటిలో రకానికి ఒక దుంపను పరీక్షించి సుగుణాలు కనపరచినవాటిని మాత్రమే పెంచి వాటిలో వాటికి పుష్పపరాగ సంపర్కము జరిపి అలాగ వచ్చిన విత్తనాల మొక్కల్ని గుణాల్ని బట్టి వింగడిస్తూ పోతే సుగుణాల్ని క్రమంగా ఒకరకం విత్తనంలో కూర్చుకోవచ్చును అనే అనిపిస్తుంది.'









# కథ కంచికి

— లలిత —

నడిపించే అగ్రరాజ్యాలు వేరు.

నడపబడే బడుగు రాజ్యాలు వేరు. చోదక రాజ్యాలతో సమాన ప్రతిపత్తి బడుగు రాజ్యాలకీ కావాలంటే ఎలా?

ఈ సంఘర్షణ యీ నాటిది కాదు. దేవతల కాలం నుంచి వున్నదే. కైలాసంలో పుట్టి ఆ కథ కంచికి వెళ్లి, అక్కడ పృథ్వీలింగం అవతరణకి కారణ భూతమైంది. (పృథ్వీలింగం కంచిలో లేదు, తిరువళ్లూరులో వుందని కొందరిమతం!)

భూతపతీ, భూధర రాజకన్యా యిష్టాగోష్ఠి కావిస్తున్నారు. కాననసభలో మంత్రుల ప్రసంగాల నెదుర్కొనే అవాంతరాల్లా, పార్వతి అంశచే సంభవించిన అరవై నలుగురు శక్తి స్వరూపిణులు, ఆ గోష్ఠికి అవాంతరం కలిగించేరు. పరమ శివుని అర్ధ శరీరమైన పార్వతితో సమాన ప్రతిపత్తి తమకీ కావాలని ఆందోళన వ్యక్త పరిచారు.

ఆ వాదాన్ని సహించలేక, వారి అహంకారం అణచి వెయ్యాలన్న పరమశివుని సంకల్పంచే, శక్తి స్వరూపిణులు వివస్త్రలైనారు.

వారు సిగ్గుపడ్డారు. పడి, పార్వతి పాదాల మీద పడ్డారు, "త్వమేవ చరణం శరణం" అంటూ! ఆమె కరుణించింది. వారి మానం కాపాడడానికి, "సూర్య శశాంక వహ్ని నయనుడైన" పతి కన్నులు మూసింది.

లోకం చీకటి మయమైంది. జల ప్రళయం సంభవించింది. విలయాతీతుడు, చిరంజీవి, అయిన మార్కండేయుడు చీకటిలో వెల్లువలో కొట్టుకపోతూ మృత్యుంజయుని స్మరించాడు చేయూతనిమ్మని. స్మరణ సార్థకమై వరం లభించింది. ఒక మామిడి చెట్టు (ఏకామ్ర వృక్షం) గోచరించింది. వరదనుంచి గట్టెక్కి చెట్టెక్కేడు మార్కండేయుడు.

ఆ చెట్టు తొర్రలో వొక నగరం, ద్రవోపద్రవానికి అతీతమై సురక్షితమై వుంది. అదే కంచి. (శివకంచి)

కామాక్షీ సమేతుడై కంచిలో పృథ్వీలింగమై అవతరించాడు, భూతపతి. కథ కంచికి వెళ్లింది.

పృథి వ్యాపస్తేజో వాయురాకాశలలో భూమికి మాత్రమే ప్రాధాన్యం వుంటే, తదితర భూతాలు సమాన ప్రతిపత్తికోసం మళ్లీ ఆందోళన చెయ్యకుండా, జంబుకేశ్వరంలో అప్లింగమై, అరుణాచలంలో తేజోలింగమై, శ్రీ కాళహస్తిలో వాయులింగమై, చిదంబరంలో ఆకాశలింగమై; సమాన హక్కుల ఆందోళనకి పరిష్కారమై అవతరించాడు శివుడు.

ఫలశ్రుతి : వ్రాసినవారికీ, వేసిన వారికీ, చూసినవారికీ సమాన హక్కులు సిద్ధించే వరం ప్రసాదిస్తాడు వరదుడు! 

# పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడర్

**తాజా హాయికీ, చెమట పీల్చడానికి, కమ్మని పరిమళానికీ ఉత్తమమైనది**




స్నానం చేసిన తరవాత పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడరు ఒంటినిండా జల్లుకొని చాలాసేపు నిలచే తాజాతనాన్నీ, సువాసననూ పొందండి...అతి నాజూకైన సువాసనతో కూడిన యీ టాల్కం పౌడరు క్షణంలో చెమటను పీల్చి, ఏ వాతావరణంలోనైనా, రోజంతా ఆహ్లాదకరమైన చల్లదనాన్నీ, తాజాతనాన్నీ చేకూరుస్తుంది! ఇంటిల్లపాదికీ యీ పౌడరు ఎంతో ఆదర్శమైనది.

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపితము)

**ప్రతి కుటుంబానికి అందుబాటులో ఉండే అపురూప టాల్క్**

JWT-P.3216

# ఆధునిక క్రొత్త టూత్ పేస్టు




# హెక్సాక్లోరోఫిన్ చేర్చినది

దంతాల ఆరోగ్యాన్ని ఎల్లప్పుడూ కాపాడుటకు అవసరమైనది ఎపిక్. హెక్సాక్లోరోఫిన్ కలిపిన ఎపిక్ టూత్ పేస్టు యొక్క నురుగ బాక్టీరియా క్రిములను నాశనముచేసి పళ్లను తెల్లగా శుభ్రపరుచును. రోజంతా నోరు సువాసనగాను చల్లగాను వుంచుటకు ఎపిక్ టూత్ పేస్టు ఉపయోగించండి.

తెల్లని
ఎపిక్ టూత్ పేస్టు
పళ్లను తెల్లపర్చి
నోటి దుర్వాసన
పోగొట్టును



ఓరియంటు ఫార్మ ప్రైవేటు లిమిటెడ్, మద్రాసు 43

ajanta OP.E/64-2-A-TG

## 26-3-1965 శుక్రవారం మొదలు 1-4-1965 గురువారం వరకు.

### మేషం :

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

ఆదాయం బాగానే ఉన్నా, వృత్తి వ్యాపారాల్లో సామాన్యమైన వ్యవహారాలకు కూడా విశేషమైన వ్యయ ప్రయాసలకు గురి కావలసిన పరిస్థితి ఏర్పడడం వలన ఈవారం అంత సంతృప్తికరంగా ఉండక పోవచ్చును వ్యాపారంలో అధిక వ్యయం జరగడం వలన ఆర్థికంగా ఒత్తిడి రావచ్చును. వృత్తిలో నూతన వ్యవహారాలు వాయిదా వేయడం మంచిది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషికి ఆటంకాలు రావచ్చును. వారాంతంలో చేసే ప్రయాణాలు లాభిస్తాయి.

స్త్రీలకు—స్వల్పం అనారోగ్యం చేయగల సూచనలు ఉన్నాయి. బంధువుల వ్యవహారాల్లో అనుకూల వార్తలను వింటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి మృగ 1, 2 పా)

గడచిన కొద్ది వారాలకంటే ఈవారం అనుకూలంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీ అభిప్రాయాలను అమలు జరపడానికి అవకాశాలు లభించడం వలన కేవలం అధికాదాయమే కాకుండా విజయాన్ని సాధించామనే సంతృప్తి కూడా లభిస్తుంది. అధికారుల వలన జరుగ వలసిన వ్యవహారాల్లో ఏమాత్రం అశ్రద్ధ చేసినా తీవ్రమైన ఆశాభంగానికి గురికావలసి వస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించవచ్చును. అనవసరమైన వాద ప్రతివాదాలకు దిగి యిటువంటి అమూల్యమైన కాలాన్ని వ్యర్థంచేసి కొనే ప్రమాదం ఉంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరముగా ఉంటాయి. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది కళాకారిణులకు మంచి సమయం.

### మిధునం :

(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు, 1, 2, 3 పా)

వృత్తి వ్యాపారాల్లో వారం ప్రారంభంలోనే కొన్ని చికాకులకు గురికావలసి వస్తుంది కాని వారాంతానికి అన్ని వ్యవహారాల్లోను అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి. ముఖ్యమైన వ్యవహారాలు వారంలో రెండవ భాగంలో పూర్తిచేయడం మంచిది. వ్యాపారంలో మీరు యితరుల వ్యవహారాల్లో జోక్యం చేసికొన వలసి వస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగానే ఉంటాయి వృత్తిలో కొత్త వారితో పోటీ ఏర్పడ వచ్చును ఉద్యోగంలో ఇతరులు చేసిన పొరబాట్లకు కూడా మీరే బాధ్యత వహించ వలసి వస్తుంది. ఆరోగ్యం బాగానే ఉన్నా ఆందోళన కలుగుతుంది.

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| ర బు శు | | గు రా | |
| శ | వారఫలం | | |
| | మహేష్ | | కు |
| చం | కే | | |

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధువులకు సహాయం చేస్తారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

వృత్తి వ్యాపారాల్లో ఆదాయం బాగానే ఉన్నా ఏ క్షణంలో ఏమిటి జరుగుతుందో అనే ఆందోళన కలగడం వలన ఈ వారం అంత సంతృప్తికరంగా ఉండదు. వ్యాపార రీత్యా చేయవలసిన దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో వారాంతంలో నష్టం రావచ్చును. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు మాత్రం కొంచెం బాగా ఉంటాయి. ఉద్యోగంలో ముఖ్యమైన వ్యవహారాల్లో యితరులను నమ్మి వ్యవహరించడం మంచిదికాదు. కోర్టు వ్యవహారాలు మాత్రం యిదివరకటి కంటే బాగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో కృషిచేసే వారికి మంచి సమయం.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. సంతానానికి సౌఖ్యం లభిస్తుంది.

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈ వారం అంత బాగా ఉంటుందని ఆశించడానికి అవకాశంలేదు. ఆదాయం మాట ఎలాగ ఉన్నా వృత్తి వ్యాపారాల్లో సాటివారితో మాట పట్టింపులు రాగల సూచనలు ఉన్నాయి. సాధ్యమైనంతవరకు అన్ని వ్యవహారాల్లోను తటస్థ విధానం అవలంభించడం మంచిది. వృత్తిలో మీరు యిదివరకు జరిపిన వ్యవహారాల్లో ఆందోళన కలిగించే పరిస్థితులు ఏర్పడుతాయి. ఉద్యోగంలో ప్రయోజనంలేని ప్రయాస పెరుగుతుంది. ప్రయాణాలు అంతగా ఫలించవు. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో యింతవరకు మీకు అనుకూలంగా ఉన్నవారే మిమ్మల్ని వ్యతిరేకించవచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది. విలాస వస్తువులు కొంటారు.

**ఈవారం ధరలు**

ఈ వారంధరలు:— అపరాల ధరల్లో పెద్దమార్పులు యేమీ రాక పోవచ్చును. పసుపు ధర పెరుగుతుంది. బెల్లం ధర వారం ప్రారంభంలో కొంచెం తగ్గి వారాంతానికి నిల బడుతుంది. మిర్చి ధర కొంచెం తగ్గుతుంది. నూనె, నువ్వుల ధరలు నిలకడగా ఉంటాయి.

### కన్య :

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా)

ఈవారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో వారం ప్రారంభంలో జరిపే వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. వారాంతంలో మీ కార్యక్రమాల్లో ఆదాయం కంటే హడావుడి అధికంగా ఉంటుంది. భాదీయెత్తున చేసే వ్యాపారాల్లో మీకు విశేషమైన ప్రాబల్యం గల వ్యక్తుల సహాయం లభిస్తుంది. వృత్తిలో నూతనావకాశాల కోసం మీరు చేసే ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి యిదివరకటి కంటే బాగా ఉంటుంది. కొన్ని వ్యవహారాల్లో అనవసరమైన వ్యయం జరగవచ్చును. బంధువులకు సంబంధించిన వ్యవహారాల్లో ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు కొద్ది మార్పులతోనే నెరవేరతాయి. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

### తుల :

(చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పా)

ఈవారం మీరు ఘన విజయాల్ని ఏమి సాధించలేక పోవచ్చును. గాని వృత్తి వ్యాపారాల్లో సామాన్యమైన ఫలితానికి లోపం ఉండదు. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో కలిగే ఆకస్మిక సంఘటనల వలన మీ కార్యక్రమాలను పునరాలోచించుకోవలసి వస్తుంది. వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందగల సూచనలు ఉన్నాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో ఇదివరకు ఏర్పడిన చికాకులు చాలవరకు తొలగి పోతాయి. వారాంతంలో సాంఘిక కార్యక్రమాల్లో భేదాభిప్రాయాలు రావచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయతగదు. సంతోషకరమైన వార్తలను వింటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

### వృశ్చికం :

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

మీరు యిదివరకు ఎంత ప్రయత్నం చేసినా నెరవేరని వ్యవహారాలు కూడా ఈవారం మీరు విశేషమైన కృషి చేయకుండానే అనుకూలించగల సూచనలు ఉన్నాయి. వృత్తి వ్యాపారాల్లో మీకు ముందు ప్రయోజనంగల మార్పులు వస్తాయి.

సాహసముతో కూడిన వ్యవహారాలు వారాంతంలో రాణిస్తాయి. వృత్తిలో ఇంతవరకు ఉన్న పోటీ చాలవరకు తగ్గుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరిగినా గౌరవం బాగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాలు మాత్రం యింకా అనుకూలించ వచ్చు. ఆరోగ్యం బాగానే ఉన్నా కొంచెం బలహీనత చేస్తుంది.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**ధనుస్సు :**

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ఈ వారం గత వారం కంటే బాగా ఉన్నా విశేషమైన ప్రయోజనాన్ని ఆశించడానికి అవకాశం లేదు. వృత్తి వ్యాపారాల్లో మీరు ప్రయత్నించిన ప్రతి పనీ నెరవేరుతున్నట్లే కనిపిస్తుంది కాని, వారాంతానికి మీరు సాధించిన అభివృద్ధి ఏమీ ఉండకపోవచ్చును. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బుమీద ఆధారపడి నూతన వ్యవహారాలు ప్రారంభించడం తగదు. కోర్టు వ్యవహారాల్లో మీ వాదం గెలవడానికి ఉపకరించే సంఘటనలు జరుగుతాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. వస్త్ర వ్యాపారులకు, రాజకీయ నాయకులకు యోగవంతమైన సమయం.

స్త్రీలకు—ఆరోగ్యం యిదివరకటి కంటే బాగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

**మకరం :**

**(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)**

ఇతరుల దృష్టిలో ఈవారం మీకు యోగవంతమైనదే కాని మీకు మాత్రం అంత సంతృప్తికరంగా ఉండకపోవచ్చును. వృత్తి వ్యాపారాల్లో చాలా శ్రమ మీద స్వల్పాభివృద్ధిని సాధించగలరు. అధికారుల వలన జరుగ వలసిన వ్యవహారాల్లో అధికారులు మీపట్ల అనుకూలంగానే ఉన్నా యితరుల జోక్యం వలన కొంచం ఆలస్యం కావచ్చును. ఆర్థిక వ్యవహారాలు వారం ఆఖరులో బాగా ఉంటాయి. వృత్తిలో ప్రయోజనకరమైన సంభాషణలను జరుపుతారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి పరిగణింప బడడానికి అవకాశం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కొంచెం శ్రమ కలిగినా మొత్తంమీద సంతృప్తికరంగా ఉంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

**కుంభం :**

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం,పూ. భా. 1, 2, 3పా)**

వారం ప్రారంభంలో వృత్తి వ్యాపారాల్లో వ్యయ ప్రయాసలకు గురి కావచ్చును. కాని వారాంతానికి తగిన అభివృద్ధిని సాధించడం వలన యీ వారం సంతృప్తికరంగానే ఉంటుంది. వ్యాపారం భారీయెత్తున చేయడం వలన ఆర్థికంగా ఒత్తిడి రావచ్చును. వృత్తిలో మీరు యిదివరకు ప్రయత్నించిన అవకాశాలు యిప్పుడు లభిస్తాయి. వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు అనుకున్నంత బాగా ఉండక పోవచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాల్లో వారం ప్రారంభంలో నష్టం రాగల సూచనలు ఉన్నాయి. రాజకీయ వ్యవహారాల్లో కొంచెం శ్రమమీద అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో గౌరవం బాగా ఉంటుంది. వినోదకాల క్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం :**

**(పూ. భాద్ర, 4 పా, ఉ. భా. రేవతి.)**

వృత్తి వ్యాపారాలు పైకి ప్రశాంతంగానే ఉన్నట్లు కన్పిస్తాయి గాని మీరు యేమాత్రం యేమరుపాటుగా ఉన్నా నష్టం రావచ్చును. వారం ప్రారంభంలో అన్ని వ్యవహారాలు ప్రోత్సాహకరంగానే ఉంటాయి గాని వారాంతానికి అనుకోని చికాకులు వస్తాయి. మీరు స్వంతంగానే చేసే వ్యాపారాల కంటే భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వృత్తిరీత్యా చేయవలసిన దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. ఉద్యోగంలో మీపరిస్థితి అంతబాగా ఉండక పోవచ్చును. శుభ కార్యాల విషయంలో అనుకూలమైన సంఘటనలు జరుగుతాయి.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు బాగానే ఉంటాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు. ఉద్యోగినులకు అనుకూలమైన సమయం. ★

# జన్మదినఫలం

## మార్చి-26

ఈ సంవత్సరం మీరు విశేషమైన అభివృద్ధిని సాధించలేక పోయినా, గత సంవత్సరంలో వృత్తి వ్యాపారాల్లో ఏర్పడిన చికాకులను సంతృప్తికరంగా పరిష్కరించగలరు. నూతన వ్యవహారాలు వెంటనే ప్రోత్సాహకరంగా ఉండకపోయినా, ముమ్ముందు లాభించుటకు మార్గం ఏర్పడుతుంది. వ్యాపారంలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నం చేస్తారు. ముఖ్యమైన వ్యవహారాలు మీరు స్వయంగా చూడడం మంచిది. వ్యాపారంలో ప్రయోజనంగల మార్పులు వస్తాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగానే ఉంటుంది. ఇంతవరకు మీరు రాదనుకొన్న డబ్బు సంవత్సరం మధ్యలో అందగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. బంధువులకు సహాయం చేస్తారు. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## మార్చి-27

వృత్తి వ్యాపారాల్లో మీకు నష్టం కలగక పోవచ్చును. కాని ప్రతి వ్యవహారంలోను ఎంతో ప్రతిఘటనను ఎదుర్కోవలసిన పరిస్థితి ఏర్పడడం వలన ఈ సంవత్సరం అంత సంతృప్తికరంగా ఉండక పోవచ్చును. వ్యాపారంలో గౌరవం బాగా ఉంటుంది. ఇతరుల వ్యవహారాల్లో మీ ఆలోచనలు బాగా పనిచేస్తుంటాయి. గాని మీ స్వంత పనుల్లో వాటి ప్రయోజనం అంతగా ఉండదు. వృత్తిలో ఏ వ్యవహారాన్నీ పూర్తిగా నెరవేరే వరకూ నమ్మడానికి అవకాశంలేదు. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. కొంతమంది వ్యక్తులు మీకు ఉపకారం చేద్దామని అనుకొన్నా ఏవో ఆటంకాలు రావడం వలన ఆలోచన కార్యరూపం ధరించదు. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. విద్యార్థులు మొదటనుంచి శ్రద్ధగా చదవడం అవసరం.

## మార్చి-28

అప్పుడప్పుడు మీ తొందరపాటువలన వృత్తి వ్యాపారాల్లో కొన్ని చికాకులు రావచ్చును కాని మీకు కొంతమంది ప్రముఖ వ్యక్తుల సహాయం లభించడంవలన యీ సంవత్సరం తగినంత అభివృద్ధిని సాధించడానికి అవకాశం ఉంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాల్లో అసలు వ్యక్తులు మీకు అనుకూలంగా ఉన్నా మధ్య వ్యక్తుల జోక్యంవలన ఆలస్యం జరగవచ్చును. వ్యాపారంలో సంవత్సర మధ్యలో అన్ని వ్యవహారాలూ చురుకుగా సాగి ఆదాయం పెరుగుతుంది. వృత్తిలో కొంత ప్రయాసమీద సంతృప్తికరమైన అభివృద్ధిని సాధించగలరు. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగా ఉంటుంది. పోటీవారిలో మీ గొప్పతనాన్ని రుజువుచేసుకొనగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా కొంచెం లాభిస్తాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు. విద్యార్థులు కొంచెం శ్రమమీద కృతార్థులు కాగలరు.

## మార్చి-29

సంవత్సరం ప్రారంభంలో వృత్తి వ్యాపారాల్లో అనిశ్చిత పరిస్థితి ఏర్పడడం వలన మీరు పొందవలసిన లాభాన్ని కూడా పొందలేక పోవచ్చును. కాని, సంవత్సరాంతానికి మాత్రం కొంచెం బాగానే ఉంటుంది. దీర్ఘకాలానికి ఫలితాన్ని యిచ్చే భారీ వ్యవహారాల్లో నష్టం రాగల సూచనలు ఉన్నాయి ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి వదలివేయడం మంచిది. వృత్తిలో పోటీవారితో పోటీ అధికం కాగలదు. ఉద్యోగంలో స్థానచలనం కలగవచ్చును. రావలసిన డబ్బు సమయానికి అందక యిబ్బంది కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు అంతగా రాణించవు. స్థిరాస్థి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆరోగ్యం బాగానే ఉన్నా కొంచెం బలహీనత కన్పిస్తుంది. కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కావచ్చును.

## మార్చి-30

ఈ సంవత్సరం అన్నివిధాలా అనుకూలంగా ఉంటుంది. ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాల ప్రభావం రాబోయే సంవత్సరాలమీద కూడా ఉంటుంది కాబట్టి చాలా జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం. వృత్తి వ్యాపారాల్లో మీరు విశేషమైన ప్రయత్నం చేయకుండానే అనుకూలమైన మార్పులు వస్తాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల కంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభించ వచ్చును. ఉద్యోగంలో ఉన్నత స్థానం కోసం మీరు చేసే ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి వృత్తి వ్యాపారాల్లో పోటి వారితో తగాదా రావచ్చును. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభిస్తాయి. మీకు అంతగా యిష్టం కాని వ్యక్తులతో సన్నిహితంగా ప్రవర్తించ వలసి వస్తుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది. విద్యార్థులకు కొంచెం శ్రమమీద క్లాసు రావచ్చును.

## మార్చి-31

ఈ సంవత్సరం ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా రానురాను వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వ్యాపారంలో మీకు కొంత మంది మిత్రుల సహాయం లభించడం వలన తగిన అభివృద్ధిని సాధించ గలరు. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు మాత్రం అనుకొన్నంత బాగా ఉండక పోవచ్చును. వృత్తిలో ఆదాయం, అంతస్తూ కూడా పెరుగుతాయి. వృత్తిరీత్యా దూర ప్రయాణాలు చేస్తారు. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. స్థిరాస్థి వ్యవహారాలు మాత్రం బాగా ఉండవు. ఆర్థిక వ్యవహారాలు బాగానే ఉన్నా రావలసిన డబ్బుమీద ఆధారపడి నూతన వ్యవహారాలు ప్రారంభించడం మంచిది కాదు. ఆరోగ్యం బాగా ఉంటుంది. కొంతమంది బంధువులు తమ స్వార్థం కోసం మీ కుటుంబంలో భేదాభిప్రాయాలు కల్గించడానికి ప్రయత్నిస్తారు. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## ఏప్రిల్-1

ఈ సంవత్సరం వృత్తి వ్యాపారాల్లో ఆదాయం మాట ఎలాగ ఉన్నా హడావిడి మాత్రం అధికంగా ఉంటుంది. వ్యాపారంలో క్రమాభివృద్ధిని సాధించ గలరు. కాని, మీరు యితర వ్యవహారాల్లో చిక్కు కొనడంవల్ల పొందవలసినంత లాభాన్ని పొందలేక పోవచ్చును. భారీయెత్తున చేసే వ్యాపారాలు సంవత్సరం ఆఖరులో బాగా ఉంటాయి. వృత్తిలో అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. కాని ఎవరినీ విశేషంగా నమ్మి వ్యవహరించడం మంచిది కాదు. ఉద్యోగంలో అధికారులతో స్వల్ప భేదాభిప్రాయాలు వచ్చినా, మీ అభిప్రాయాల సరియైనవని రుజువు కావడం వలన ఇతోధికమైన గౌరవాన్ని పొంద గలరు. కోర్టు వ్యవహారాల్లో శ్రమమీద్ద విజయాన్ని సాధించ గలరు. ఆరోగ్యం బాగానే ఉంటుంది. మిత్రులకు సహాయం చేస్తారు. విలువైన వస్తువులు కొంటారు. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కావచ్చును. ★

# పలుకని స్వరాలు

అనుపమాదేవి

గేటు యథాప్రకారం మూసి రోడ్డుపైకి వచ్చి ఒక్క క్షణం ఆలోచనలో నిమగ్నయ్యి, పొదల్బుకున్న దిక్కునకభిముఖంగా బయల్దేరింది నిరుపమ. వైశాఖమాసం వచ్చింది. సాయంత్రం ఆరు గంటలైనా ఎండ వేడిమి తగ్గలేదు. వడగాడుపు కూడా మొదలైంది. స్నేహితురాలింటికి వెళ్ళి ఆమెను తీసుకుని సినిమాకు వెళ్తానని చెప్పింది తండ్రితో. కానీ బయటకు వచ్చేసరికి ఆ ఆలోచనలకు స్వస్తి చెప్పి చీకటిపడేవరకూ నిర్మానుష్యంగా ఉండే ఆ రోడ్డుపైన్నే కొంతదూరం వెళ్ళి రావాలనుకుంది. ఈ రోజున సినిమాక్కు వెళ్ళాలనిగానీ, స్నేహితులతో మాట్లాడాలనిగాని లేదామెకు. అంతకంటే ముఖ్యమైన తన భవిష్యత్తువైపు సాగిన్నై ఆలోచన్లు. ఈ రోజువరకూ తనకై తాను స్వవిషయం ఆలోచించి ఎరుగదు. కానీ ఇటీవలే ఏవో దుష్టగ్రహాలు తన జాతకంలోనో, తన తండ్రి జాతకంలోనో ప్రవేశించినై. "కాకపోతే నిన్న సాయంత్రం నాన్న చెప్పిందేమిటి మరి!" పది నిమిషాలు గడిచేసరికి గాడ్పు పూర్తిగా తగ్గింది. అసరికి ఆమె గమ్యస్థానం సమీపించింది. రెండు రోడ్లు చీలేచోట ఒక నిమిషంపాటు నిల్చుని దగ్గరలో కన్పించే మామిడితోపువైపు నడిచింది.



అక్కడికివెళ్ళే, నిర్భయంగా మరికొంతసేపు కూర్చో వచ్చనుకుంది.

ఇకముందు జరుగవలసిందాన్ని ఆలోచించుకోవాలి. నిన్న సాయంత్రం తండ్రీ కూతుళ్ల మధ్యన జరిగిన కొద్దిపాటి సంభాషణే ఇందుకు కారణం. ఆట్టే ఉపోద్ఘాతం లేకుండానే ఒక్కసారిగా గుండెలదిరిపోయేవార్త చెవున వేశాడు తండ్రి. ఆయన తనకు గుండెజబ్బున్నదనీ, ఏ క్షణాన్నైనా చనిపోవచ్చునీ' చెప్పకపోయినట్టయితే బహుశా ఇంకా చాలా కాలంవరకూ నిరుపమ నిశ్చింతగా ఉండగలిగేదే. ఈ సంగతి తండ్రి ఇంతవరకూ చెప్పి ఉండలేదు. ఇప్పుడు చెప్పక తప్పదని చెప్పాడు. నిన్న సాయంత్రంనుంచీ నిరుపమకు నిద్రాహారాలు లేవు

క్రితంరోజు సాయంత్రం డిస్పెన్సరీ చేరుకుని తండ్రి విశ్రాంతి తీసుకునే గదిలోకి అడుగుపెట్టేసరికి బయట చీకటి పడుతోంది. గదిలో పడక కుర్చీలో ఆయన ఒంటరిగా ఆలోచనల్లో మునిగిపోయి కూర్చున్నాడు. నిరుపమ లోపలికి వచ్చిన సవ్వడి ఆయన చెవులవరకూ వెళ్లనేలేదు. అందుకని తండ్రిని లేపేవంతు తనపైనే వేసుకున్న దామె. కుర్చీలోంచి లేచి కిటికీ దగ్గరగా వెళ్ళి నిల్చుని మౌనంగా బయటకు చూడసాగాడు చుట్టుప్రక్కల వీధి దీపాల వెల్తురులో పిల్లవాండ్లు ఆడుకోవటమూ—అక్కడక్కడ త్రాగినవాళ్ళు అరుస్తూ తిట్టుకోవటమూ కన్పిస్తాయి అక్కడినుంచి. దూరాన రైలుబండి పోవటమూ కన్పిస్తుంది. మనుషులు గుంపులు గుంపులుగా టవున్నుంచి ఇండ్లకు చేరుకుంటున్నారు పెద్ద పెద్ద కేకల్తో, వెకిలి నవ్వుల్తోనూ. ఇంత సందడీ బహుశా ఆయన ఆలకించే ధోరణిలో ఉన్నట్టు లేడు. ఆయన గాంభీర్యం, మౌనం ఇన్నేళ్ళుగా ఎరిగినదైఉండీ కూడా నిన్నటిరోజున ఎందుకో భయపడింది నిరుపమ. ఎటూ తోచక తనూ తండ్రి ప్రక్కగావెళ్ళి బయటకుచూస్తూ నిల్చుంది. రోడ్డుపైన యువకు డొకడు ఈలపాట పాడుకుంటూ జోరుగా సాగిపోతున్నాడు. మరికొంతసేపటికి ఓ భిచ్చగాడు వాడిబిడ్డ ఆసరాగా సంధ్యాకబళం ఆడుక్కుంటూ కన్పించా డామెకు. తండ్రి చేతిని తన చేతిలోనికి తీసుకుని మొహంలోకి చూస్తూ 'నాన్నా' అని పిల్చింది. డాక్టరు శ్రీనివాసరావు కండ్లలోని నీరు జలజలా ప్రవహించింది. కూతురు కలవర పడింది. జీవితంలో మొదటిసారిగా ఆయన కన్నీరు కార్చాడు. ఈ ఆకస్మిక ప్రవర్తనకు బెంబేలుపడి ఏడుస్తూ తండ్రిని మళ్ళీ పిల్చింది. ఈసారి పిలుపు గుండెను చీల్చే పిలుపు. మరికొంతసేపటివరకూ తండ్రీ కూతుళ్లు ఇద్దరూ నిశ్శబ్దంగా రోదించారు. అప్పటికిగానీ ఆయనకు మాట పెకల్లేదు. అప్పుడే చెప్పాడు. లోకంలో ఆమెకు ఒక్కగానొక్క అండ కూడా కొద్దికాలంలో లేకుండా పోవచ్చని. ఎంత నమ్మకూడదనుకున్నా బ్రహ్మరాక్షసిలా తరుముకుని వస్తూనే ఉందా ఆలోచన.

......గంభీరత, ప్రశాంతత అప్పటి కప్పుడే మళ్లీ ఆయనలో ప్రవేశించినై. చాలా తాపీగానూ సహజ ధోరణిలో మాట్లాడాడు.

“చాలా రోజుల్నుంచీ హృద్రోగంతో బాధపడుతూనే ఉన్నాను. కానీ ఇప్పటివరకూ నీతో నే చెప్పే అవకాశంగానీ, అవసరంగానీ లేకపోయింది. మొన్నీమధ్య హైద్రాబాదు వెళ్లినప్పుడు నా స్నేహితుడు నన్ను బాగా పరీక్షించి ఈ విషయం నీతో చెప్పే సమయం వచ్చిందన్నాడు. అప్పటికీ చెప్పేవాణ్ణేకాదు. నిన్ను ఈ క్షణంనుంచే బాధ పెట్టడం నా కిష్టంలేదు. అయినా ఆడబిడ్డవైనా, మొగబిడ్డవైనా నువ్వే కాబట్టి ఇంటి వ్యవహారాలు చూచుకునేందుకు చెప్తున్నానమ్మా”—అని బరువు దింపుకున్నవాడిలా నిట్టూర్పు వదిలాడు. అప్పటికే దిగాలు పడివున్న నిరుపమ తండ్రి ఈ మాట అనేసరికి అంతు తెలీని అగాధాల్లోకి విసరి వేయబడుతున్నదానిలా భయపడింది. శరీరమంతటా చిరు చెమటలుపోసి ఒంట్లో వణుకు మొదలైంది.

జన్మతః జీర్ణించుకున్న గంభీరత, నిశ్చలతతో కూడా శ్రీనివాసరావు తన కూతురు పరిస్థితి గ్రహించేసరికి మళ్లీ దుఃఖం పొర్లుకొచ్చింది. దాన్ని దిగమింగి గొంతును సవరించుకుని మాట్లాడసాగాడు.

‘.... అయినా ఫరవాలేదమ్మా— ఈ జాతి అంతా ఇంతే. ఉన్న రోగానికి మందైతే సరిగా కనుక్కోరు గానీ ఇలాంటి సలహాలు మాత్రం యిస్తుంటారు. ఏమైనా ఈవిధమైన జబ్బుతో బాధపడేవాళ్ళు త్వరగా చావరులే. అంతేగాక విచిత్రం చూశావా—ఎక్కువ రోజులు బ్రతకదల్చుకుంటే జీవితపు ఉత్తరార్థంలో హృద్రోగాన్ని కోరి తెచ్చుకోవాలమ్మా”—అని నవ్వ ప్రయత్నించాడు. ప్రాణం లేని చిరునవ్వొకటి మొహంపై మెదిలింది.

ఈమాటలంటున్నప్పుడు తన చేతుల్తో లాలనగా కూతురు తల నిమురా లనుకున్నాడు. కానీ ఏనాడూ అలవాటులేని పని ఈనాడూ చేయనిచ్చింది కాదు ఆయనలో ఉన్న జడత్వం. పితృవాత్సల్యపు చిహ్నాలు ఏనాడూ ఆయన మాటల్లోగానీ చేతల్లోగానీ కనబర్చలేకపోయాడు. ఆ దుష్టశక్తే ఈరోజున యీ దుర్ముహూర్తానకూడా తనరక్తం పంచుకుని పుట్టిన బిడ్డపైన కరుణాత్మకమైన చల్లదనాన్నీ, ఆపేక్షనూ బయల్పెడ నిచ్చింది కాదు !

అక్కడి నుంచి సరాసరి బయటకు వచ్చి కార్లో కూర్చున్నాడు. మరికొంతసేపటికి నిరుపమలో చైతన్యం వచ్చింది. మెల్లగా బయటకు నడిచి ఎదురుగా కార్లో తండ్రిని చూచి తనూ కారెక్కి కూర్చుంది. చాలాసేపటివరకు గానీ డ్రైవరు వచ్చి కారును బయల్దేరనీయడం ఆ యిద్దరిలో బహుశా ఎవరూ ఎరుగరు.

నిన్న సాయంత్రపు ఈ సంఘటన నిరుపమ మనసులో మెదిలింది. ఆసరికి ఆమె మామిడి తోపులో ప్రవేశించింది. తోట కాపలావాడు ఆమె దగ్గరగా వచ్చి యజమానురాలుకు సగౌరవంగా నమస్కరించి ప్రక్కనే ఉన్న నులక మంచాన్ని వాల్చి నిల్చున్నాడు. మంచంమీద కూర్చుని తిరిగ్గా కబుర్లుచెప్పే శక్తిలే దిప్పుడు నిరుపమలో. కృతజ్ఞతాసూచకమైన దృక్కులతో అక్కడనుంచి కదలి మరికొంతదూరం నడిచింది. దూరంగా ఇటుకబట్టీలవాళ్ళు పని ముగించుకుని కబుర్లతో కాలక్షేపం చేస్తున్నారు. అప్పుడప్పుడు ఒకటీ రెండుకార్లు ఆ రోడ్డంట వస్తూ పోతూన్నవి. మోటబావి కాలవగట్టుపైన కూర్చుని మళ్లీ ఆలోచనలో మునిగిపోయింది.

తండ్రిలోని నిస్తబ్దత, ఆయన అసంపూర్ణ వైవాహిక జీవితం—ఈ రెండూ ఆమెను పూర్తిగా ఒంటరిదాన్ని చేశాయి. సంఘంలో ఆమె యెడల చూపబడే ఒకానొక అవాంఛనీయమైన చూపు కూడా అందుక్కారణభూతమైంది. అందుకే ఆమె ఆలోచన్లు, పనులు కూడా ఒంటరిగానే ఉండేవి. ఈ విశాల జగతిలో తనకు తానై ఒంటరిగా బ్రతకడమే అలవర్చుకుంది నిరుపమ. ఒకవిధమైన ఉత్కంఠ, ధైర్యమూ ఆమె ఆలోచన వెనుక ఉండి సాహసికమైన జీవితలక్ష్యంవైపు నిరుపమను తీసుకువెళ్తున్నవి. తన జీవితంలో ఏదో లోపించినదని ఆ ఖాళీ స్థానాన్ని భర్తీ చేయడం కోసం తను ప్రయత్నించాలని అహారవమూ తాపత్రయ పడేది. వేటగాడి చేతిలో తల్లిని కోల్పోయి, క్షుద్బాధను తనకు తానే తీర్చుకొనవలసిన ప్రయాసతో అసహాయంగా అడవిలో తిరిగే పిల్లజంతువు మాదిరి పరిస్థితే నిరుపమది కూడా.

.... తను చాలామార్లు ఈ ప్రదేశానికి వస్తుంటుంది ఒంటరిగా. ఏవో ఆలోచిస్తూ కూర్చుంటుంది. పరధ్యాన్నంగా తోటమనిషితో మాట్లాడుతుంది. ఆ ఆలోచనలు ఎక్కడా ఏ విషయంపైన కూడా కేంద్రీకరింపబడవు. బుద్ధితెలిసిన నాటినుంచీ తనకదే ప్రపంచం. కాలేజీలో అడుగుపెట్టిననాడు గానీ ఆ తర్వాతగానీ పిల్లల్లో సహజంగా రావలసిన మార్పేమీ తనలో రాలేదు. స్నేహితులు లేరు. స్నేహితురాలు—దేవి తప్ప. తానిప్పుడు ఇరవై సంవత్సరాల యువతి. ఈ యీడు ఆడపిల్లలెవరూ ఒంటరిగా ఈ సమయంలో యిలాంటి ప్రదేశానికి రాదు......

అలా అనుకునేసరికి ఆమెలో ఒక విధమైన గర్వం తొణికింది. సగర్వంగా చుట్టూ కలయజూసింది.

.... తన వాడలో, తన వీధిలో ఇన్ని సంవత్సరాలుగా ఎన్నోసార్లు తిరిగింది. నిత్యం చాలామందిని చూస్తూనే ఉంది. వాళ్ల మాటలు వింటూనే ఉన్నది. తన యిల్లన్నా ఆ పరిసరాలన్నా చాలా యిష్టం. కానీ, తనలో ఎక్కడో ఏ మూలనో అస్పష్టమైన ఆవేదన, సంకోచం, అకారణకోపం ఒక్కొక్కసారిగా మెదుల్తుంటవి. ఎందుకో తనకే తెలియదు. దేనికీ సమాధానం దొరకదు. ఫలితం—తీరని అసంతృప్తి. ఒక్కోసారి మాత్రం ఒక్కగానొక్క సమాధానం ఆమె మెదడులో మెరిసి మాయమయ్యేది. “నా తల్లిగర్భంలో నేను పడటమే కారణం”—యిది సమాధానం ..... యిలా అనుకున్న సమయాల్లో ఆమె కొన్ని రోజులపాటు

తని రాకపోకలను పూర్తిగా మానేది. చివరకు కాలేజీకి వెళ్లటం కూడా ఆమె భావనలో దోష మయేది. మిగతా రోజుల్లో ఈ తోట వరకూ సాగుతుంది ఆమె నడక. చాలావరకూ కారునే ఉపయోగించుకుంటుంది.

నిరుపమ తనకు తాను ఒంటరిదే అయినా లోకా నికి చిరపరిచితురాలు. డాక్టరు శ్రీనివాసరావుగారి కూతురుగా వ్యవహరింపబడినట్టయితే ఈరోజు వరకూ ఇంత వేదన ఆమెలో ఉండే, అవసరం అవకాశం లేకపోయేవి. కానీ దురదృష్టంవలన ఆమె డాక్టరుగారి 'లేచిపోయిన భార్య కూతురు'—

ఎవరో చెళ్ళున చరిచినట్లయి ఉలికిపడింది నిరుపమ. చుట్టూ కలయజూచి తా నక్కడికివచ్చి చాలాసేపైందని మాత్రం అనుకుంది. మెల్లగా లేచి కాలవగట్టుమీదే నాలుగడుగులు వేసింది. తేమగా ఉండటం మూలాన పచ్చగడ్డి మెత్తగా చల్లగా కాలికి తగిలింది. అక్కడే మళ్లా కూర్చుని ఈ ప్రపంచపు రొదను విదిలించుకొని తనలోనికి తాను జారిపోయింది.

తన తండ్రి ఏ క్షణానైనా చనిపోవచ్చనే సంగతి సత్యంగానూ, అసత్యంగానూ కన్పించింది. అయినా, భౌతికంగా తనను౦చి, తన చూపునుంచి శాశ్వతంగా మాయమవుతాడని మాత్రం ఆమె విశ్వ సించలేక పోతున్నది. తన తండ్రి విషయంలో చావంటే—నిర్వికారమై నిస్తేజమై ఈ లోకపు సుఖదుఃఖాలకు అతీతమై దహన సంస్కారానికి సిద్ధ పరుచబడిన చల్లని మానవాకారం మాత్రం కాదు. ఇలాంటి చావు తన తండ్రికి లేదు. ఆయనెక్క డికో దూర తీరాలకు ప్రయాణమై పోతాడు. అంతే! తన పసితనంలో ఎప్పుడో తన తల్లి కూడా అలాగే పోయింది—

ఇలాంటి వూహాల్తో నిరుపమ తాత్కాలిక మైన సమాధానపడేది. మనసు తేలికయ్యేది. ఈరోజున ఈ సమయంలో కూడా ఆమె అలాగే సముదాయింపబడింది.

.... సమయం వచ్చినప్పుడు తను కూడా ఈ పరిసరాలను వదిలి ప్రస్థానంలో కలిసి ఎక్కడికో

# పలుకని స్వరాలు

తెలీని చోటుకు వెళ్తుంది. అందరూ అంతే— ఎవరికీ యిది తప్పదు!

.... మొన్న మొన్నటి వరకూ చిన్నతనం లాగానే తండ్రి అండన, తండ్రి ప్రక్కనే గడిచింది తన జీవితం. కానీ రెండు మూడు సంవత్సరాలుగా తనలో ఏదో వ్యక్తిత్వం లాటిది కదలి తన పరిసరాలనూ, తననూ తనకు పరిచయం చేసింది పరిచయంలో స్వాగతంలేదు. మార్దవం అంతకంటే లేదు. కటిక నిజం! తనకూ తన చుట్టూ ఉన్న మానవ సమా జానికి మధ్యనున్న సంబంధ బాంధవ్యంలో ఆదరణ, ఆప్యాయత యేకోశానా కనిపించవు. ఈ రెండు, మూడు సంవత్సరాలుగా ఈ వూహ రోజురోజుకూ నిర్మారణై వేదనకు మూలమైంది. ఈ కలుషిత వాతావరణంలో పరిశుభ్రమైన చల్లటి గాలిలేక తన ఉనికే దుర్భరమైపోతున్నది—తోటి మాన వుల్లో తన స్థానాన్ని ఎదురువడి ప్రశ్నించే వాళ్లయితే లేరుగానీ, తన ఎడల ఒకవిధమైన— నిమ్నమైనదే కావచ్చు—దృష్టి ఉందని మాత్రం తాను తెల్సుకోగలిగింది.

...... చిన్నతనంలో తండ్రినీ, తల్లినీ గురించిన అపఖ్యాతి ప్రచారంలో ఉండేది తాను స్వయంగా ఒకటి, రెండుసార్లు విన్నది కూడా. కానీ అప్పట్లో అదేమిటో తెలుసుకునేపాటి లోకజ్ఞానం లేకపోయింది.

ఒకసారి తండ్రి వూళ్లో లేడు. ఇంటి ఆవర ణకు మూలగా ఒక గది ఉంది. ఆ గది రోడ్డు మీదుగా ఉంటుంది కాబట్టి తనక్కడ ఎప్పుడూ కూర్చునే అలవాటుంది. అలాగే ఆరోజూ కూర్చుంది. ఆ సమయంలో ఎవరో ఇద్దరు మాట్లాడుకుంటూ దారిన వెళ్తున్నారు.

"ఇల్లెవరిదిది. చాలా బాగుంది"—.....

"డాక్టరుగారిది. ఆయన పెళ్ళాం లేచి పోయిందిలే—ఓ అదో కథ"—

"అయితే మళ్లీ పెళ్లి చేసుకున్నాడా."

"లేదు. కానీ, ఆ లేచిపోయినావిడకో కూతురు కలిగింది ఆ అమ్మాయి చాలా బాగుంటుందిలే. పుత్తడిబొమ్మనుకో—"

"ఆ తల్లికి తోడి కూతురు కాదుగదా ?—"

అంతవరకే విన్నది. ఆతర్వాత ఏమైనా మాట్లాడుకున్నారో లేదో తెలీదు గానీ తను మాత్రం ఆపైన వినదల్చుకోలేదు. విన్పించలేదు కూడా. అప్పటి తనకు పధ్నాలుగేళ్లు. పరిపూర్ణ జ్ఞానం లేదు. లోకం పోకడను అప్పుడే అర్థం చేసుకుంటున్నది. ఆ తరుణంలో ఈ మాట విన్పించి మనసు విరిగి ప్రపంచానికి దూరంగా మెలగుతూ వచ్చింది వయసుతోబాటు తా నేదో తప్పు చేశా నన్న భావం కూడా పెరుగుతున్నది. ఆ దోషం ఎలాంటిదో ఏదో తెలియదు......

దూరాన్నుంచి పెద్ద రొద చేసుకుంటూ లారీ వస్తున్నది. లైట్లు కళ్లలో పడేసరికి బాహ్యప్రపంచంలోకి వచ్చింది. ఆకాశం వంక చూచింది అప్రయత్నంగా. నిర్మలంగా ఉండి లేత వెన్నెలను వెదజల్లుతోంది.

తనకూ తన పరిసరాలకూ మధ్యనున్న ఈ చీలిక, ఈ విభేదం తండ్రీ కూతుళ్లనిద్దరినీ చాలా దగ్గరగా తీసుకు రావల్సింది. కానీ, తా మిద్దరి మధ్యనా ఎప్పుడూ కూడా తండ్రి కూతుళ్ల మధ్యనుండే ప్రేమానురాగాలు పుష్పించ లేదు. అయితే విన్నటి యీ తన తండ్రి అస్వస్థత తామిద్దరినీ కృత్రిమ వాతావరణం నుంచి నిర్మల మైన ప్రేమా, మమతా మమకారాల దగ్గరగా తీసుకొని పోవచ్చు. పైతృక ప్రేమంటే ఏమిటో తెలియని నిరుపమను ఈ ఆలోచన ఒక్కసారిగా కదిలించింది. తండ్రియెడల భక్తిశ్రద్ధలు ఒక్క క్షణంలో మెరిసినవి. ఇన్ని సంవత్సరాలుగా తన ఎడల ఎవరికీ లేని ప్రేమానురాగం తన తండ్రి నుంచి తను పొందబోతున్నది ... ఆమె కళ్ళు రెండూ అశ్రుపూరితములైనవి. ఆ సమయాన మృత్యువు కరుణామూర్తిగా గోచరించిందామెకు. ఇలాంటి మంచిపనులు—శుభ్రమైన వాటిని— నెరవేర్చడానికే మృత్యువని ఆ నిమిషాన భావించింది నిరుపమ. ఈ మృత్యువు తన, తన తండ్రి జీవి తాల్లో ఇంతకుముందున్న చీకటిని వెళ్లగొట్టి దాని స్థానంలో అపేక్ష అనురాగాల్ని నిక్షిప్తం చేస్తుంది.

దూరాన పట్టణ మధ్యంలో దేవుడి గంటలు విన్పించినై— నిరుపమాదేవి తనలో తానే ఏదో మననం చేసుకొన్నదానిలా తల పంకించింది. కనుల నుండి నీరు ధారావాహికంగా వెలువడింది. అది దుఃఖమని చెప్పటానికి వీల్లేదు. సంవత్సరాలుగా తాను పొందలేని వస్తువు ఈనాడు పొంద బోతున్నది. కానీ .... కానీ .... ఎలా ? అంతులేని దుఃఖం.

మరో అయిదు నిమిషాలకు నిరుపమ పూర్తిగా యీ లోకంలోకి వచ్చింది. టైము చూచుకుని మెల్లగా బయల్దేరి వెన్నెల వెలుగులో తడుము కుంటూ తోట మధ్యకు చేరింది. నులకమంచం మీద తోట పనివాడు పడుకుని కూరుపాట్లు పడు తున్నాడు.—వాడి నిద్ర చెడగొట్టి మనస్కరించ లేకనే అన్నది, "ఒక్కుడూ ఇంటిదాకా వస్తావా"— అని వాడు త్రుళ్ళిపడి లేచి నిరుపమనే పరికించి చూచి "పదండమ్మా యింటివరకూ దిగబెడ



# పలుకని స్వరాలు

తాను"—అంటూ కర్ర దీసుకొని బయల్దేరాడు.

త్రోవలో వంతెన ఉంది. క్రిందు వాగు ఎప్పుడూ పారుతూ ఉంటుంది. ఈ సంవత్సరం కొద్దిగా నీరు తగ్గి ఉంది. ఆ వంతెనమీదకు వచ్చే సరికి వెంట వొచ్చే మనిషి కొద్ది దూరంలో ఉండటం గమనించింది. వంతెన పైనుంచి చూస్తే దరివెంట నుండే చెట్ల నీడల్లో ప్రవహించే నీరు కన్పించదు. కానీ అది ప్రవహిస్తున్నదని చప్పు డునుబట్టి తెలుసుకోవచ్చు. తండ్రి విషయం ఆలోచిస్తున్న నిరుపమకు అది చూడగానే తండ్రి దయార్ద్రతే జ్ఞాపక మొచ్చింది. ఆయన జీవితం కూడా అలాంటిదే అనుకుంది. వెలుగులోకి రాకుండా ఎప్పుడూ నీడల్లోనే— కన్పించకుండా ప్రవహించే సెలయేరు లాంటిది ఆయన జీవిత మనుకుంది. తండ్రిపై గౌరవం, అభిమానం ఒక్కసారిగా ఉవ్వెత్తున పొంగి పొర్లినవి. మొదటిసారిగా తండ్రిని అత్యున్నతమైన ఆపేక్షతో తల్చుకునేసరికి ఆమె కళ్లలో నీరు నిల్చింది. పితృవాత్సల్యపు చల్లని నీడలో హాయిగా కూర్చున్నట్టనిపించిం దామెకా సమయాన. తన తండ్రి తన దగ్గరే ఉండి ఆడించి లాలిస్తాడని చిన్నతనాన కలలు గన్నది. కానీ, ఈనాడు ఆ కలలు నిజమవునట్లు అను భూతి చెందింది. చాలాసేపటివరకూ అలాగే కాలువను చూస్తూ వంతెనపైనే కూర్చున్నది. "ఈనాడే ఈ కలను యదార్థంగా మార్చుకోవాలి" —తలెత్తి చూసేసరికి ఎదురుగా లక్ష్మడు కన్పిం చాడు. ఇద్దరూ మళ్లా నడక సాగించారు.

* * *

కూతురు సినిమాకని వెళ్లిపోయిం తర్వాత చాలా సేపటి వరకూ వరండాలోనే ఒంటరిగా కూర్చు న్నాడు డాక్టరు శ్రీనివాసరావు. ఆరోజు ఆదివారం కాబట్టి డిస్పెన్సరీకి వెళ్లే పనిలేదు. ఇంటికి వచ్చిన ముఖ్యులు వెళ్లిపోయారు. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. ఇంటి వెనకాలగా రైలుకట్ట ఉంది. అప్పు డప్పుడు రైళ్ళ రొద తప్ప ఆ ఆవరణ లోపలి వరకూ మరే శబ్దమూ వినరాదు. అనాలోచితంగానే లేచి కొద్దిసేపు అటూ యిటూ పచార్లు చేశాడు.

శ్రీనివాసరావు కింతమనిషి ఒక్కోసారి కడిగిన మల్లెపూవులా తెల్లని బట్టల్లో చిరునవ్వు నవ్వుతూ హుషారుగా కన్పిస్తాడు. మరొకప్పుడు నలిగిపోయి మాసిపోయిన బట్టలూ పెరిగిన గడ్డము బరువైన ఆలోచనలతో ఉన్నట్టుగా లోతుకు పోయిన కళ్లతో అసలుకు రెట్టింపు వయసు వాడిలా కన్పిస్తాడు. ఆయనేనాడూ తన ప్రాక్టీసు పైన శ్రద్ధ చూపించలేదు. అదిలేక కూడా నిక్షేపంగా బ్రతకడానికి కావలసిన ఆస్తి వేరే ఉంది. అయినా రోగులు అతనిపైన చాలా గురి పెట్టుకుని ఉంటారు. దగ్గర ఉండి పిల్చుకుపోతే ఆయన వైద్యం అద్భుతం. ఇహ డిస్పెన్సరీ విషయంలో ఆయనకూ ఆయన కాంపౌండర్లకూ లేని శ్రద్ధ రోగులకే ఎక్కువ. ఉదయం—సాయంత్రం—కాస్తంత ఆలస్యం జరిగితే వెంటనే ఎవరో ఒక రోగి తాలూకు మనిషి డాక్టరింటి వరకూ వచ్చి పిల్చుకుపోతాడు. మళ్లీ సాయంత్రం చీకటి పడేవరకూ ఆయనకు • తీరికన్నమాట ఉండదు. ఆయనేనాడు తనకు తానై ఫీజు చెప్పి పుచ్చుకోలేదు. అంతా ఆయన్ను దేముడంటారు. బయటకు వెళ్లింతర్వాత ఆయన జీవితం తాలూకు చర్చ వస్తే కొంతమంది హేళనగా, చాలా కొద్ది మంది జాలిగా అనుకుంటూంటారు.

ఆయన కూడా ఏ విషయంపైనా ఆసక్తితో ఉండడు. చాలావరకు మౌనంగా ఉంటాడు. ఎవరి తోనూ ఆప్యాయతగా మాట్లాడడు. కూతురుతో ఆయన నెలసరి మాటల్ని వ్రేళ్లపైన లెక్కించ వచ్చు. కన్పించని దానివైపు ఎప్పుడూ తదేకంగా చూస్తున్నట్టుంటాడు. మనిషి ఈమధ్య వేదాంతి కూడా అయినట్టుంది.

"భౌతికమైన యీ నా శరీరం అతి విచిత్ర మైంది. ఇన్ని సంవత్సరాలుగా ఇక్కడ దీంట్లో 'నేను'ంటున్నాననే గానీ నేను దాన్నెంత మాత్రగా ఉపయోగించుకోలేకపోయాను. ఇప్పుడిది కృశించి పోతున్నది—ఉపయోగపడకుండా. ఈలోపలే మరో జీవిని ఈ కాయం వెతుక్కుంటే ఎంత బావుణ్ను" అనుకునేవాడు ఎన్నోసార్లు.

జీవిస్తైన గాక భౌతిక శరీరంపట్ల ఆయన కవితమైన జాలి, జీవైతే ఈ శరీరాన్ని విడిచి మరో శరీరంలో ప్రవేశిస్తుంది. కానీ, శరీరం అట్లా కాదుగా. దానికి నశింపున్నది. అలా నశించి పోకముందే దాని సార్థక్యాన్ని నెరవేర్చాలి ఇదీ ఆయన మతం. ఇలా అనుకుంటున్నపుడల్లా తనలో తనే నవ్వుకునేవాడు. ఆ నవ్వులో ఉత్సాహం ఉండేది కాదు. వయసుతోపాటు పెరిగి జీర్ణించుకుపోయిన విచారం వెల్లడయేది ఆ నవ్వులో.

'దేవుడు నాకు ఆలోచించటానికి బుద్ధినీ, మాట్లాడటానికి పెదవులున్నూ, నాలుకనూ ఇచ్చాడు. కానీ, మొదటిదే ఎక్కువగా—అతిగా వాడుతూ వచ్చాను. నాకు మాటలు వచ్చి కూడా మూగవా ణ్నయాను—అలా అనిపించుకున్నా నా భార్యతో. నన్నొక జడ పదార్థంగా జమకట్టినపుడు కూడా అన్నపూర్ణను నేనేమీ అనలేదు. కానీ, ఏదో అనా లనీ, నా యీ అచేతన ప్రవర్తనకు సంజాయిషీ చెప్పుకోవాలనీ తద్వారా నిర్దోషిత్వాన్ని నిరూపించు కోవాలనీ ఎంతో అనుకునేవాణ్ని. తీరా గుండెను చీల్చుకునైనా ఒక్క ముక్క కూడా మాట్లాడ లేక పోయేవాణ్ని. ఎన్నాళ్లిలా మూగవాడితో, ప్రాణంలేని కొయ్యతో అది మటుకు కాపురం చేస్తుంది ? అందుకే ..' అన్నపూర్ణను తల్చు కోని రోజు లేదాయనకు

ఇవ్వాళ మళ్లీ అవే ఆలోచన్లు. ఎన్నో సాయంకాలాలు అన్నపూర్ణతో ఆమె ప్రక్కన మౌనంగా, నిశ్చలంగా శూన్యంలోకి చూస్తూ గడిపా డని ! ఎన్నో రాత్రులు ప్రతిసారీ తనను నవ్వించా లనీ తనను మాట్లాడించాలనీ అన్నపూర్ణ శత విధాలా ప్రయత్నించింది. తనూ అందరిలాటివాడే ననీ అందరిమాదిరి తనూ ఉత్సాహంగా తన సహ ధర్మచారిణితో కాలం గడపగలడనీ ఆశించి అలాగే తనను దిద్దుకోవాలని నానావిధాల తనతో అవస్థ పడింది అయినా తనలో మార్పు రాలేదు. .

అన్నపూర్ణతో వివాహం జరిగిననాడు తా మిద్ద రినీ చూచి అంతా ముచ్చటపడ్డారు. పెద్దవాళ్లూ, బంధువర్గంలోని వాళ్లూ—బయటివాళ్లూ అంతా

43 వ పేజీ చూడండి

## దేశరక్షణకై ఆయుధాలు ఎంత అవసరమో
## ఉత్పత్తి కూడా అంత అవసరమే

# మలబార్ గ్లోరి సబ్బు

పరిశుభ్రమైన అతి మనోహరమైన చర్మసౌందర్యానికి

దీని సువాసన ఉల్లాసకరం!
దీని నాణ్యత అత్యుత్తమం!
ఇది మలబార్ గ్లోరి సబ్బు!
గత 30 సంవత్సరములనుంచి
సబ్బులలో రాణి




ఆరు బిళ్లల గల బహుమతి
పెట్టెలో కూడ లభించుచున్నది.



వెజిటబుల్ సోప్ వర్క్సు, కాలికట్

# అపస్వరం




## జరిగిన కథ

పసితనంలోనే కన్నవారికి దూరమైన మీర, పెదనాన్న కృష్ణయ్యగారింట్లో పెరిగి పెద్దదవుతుంది. గోపీ అన్నయ్యలాగా తను కూడా డాక్టర్ చదవాలని కలలు కంటుంది కానీ ఆ కలలు ఫలించకుండా శాముతో మీర వివాహం జరిగిపోతుంది. మనస్సులోని డాక్టరవాలన్న కోర్కె తను యింటర్ ఫస్ట్ క్లాసులో పాసయిందని తెలియగానే బలవత్తరమౌతుంది. ఆ కోర్కెను భర్తతో చెప్పినా ఫలితం లేనందున గతాన్ని కొంత మరవచ్చునవే వూహతో పల్లెస్త్రీలకు విద్యాబోధన చేయాలని సంకల్పిస్తుంది. కానీ, అదీ నెలరోజులైనా సరిగా నడవక మూలపడుతుంది. ఒకానొక దృశ్యంతో మీర మనస్సులోని డాక్టరవాలనే కోర్కె తిరిగి విజృంభిస్తుంది కాని తనలోనే అణచుకుంటుంది. మీరను చూడ్డానికి కొచ్చిన స్నేహితురాళ్లు పల్లె వాతావరణానికి మురిసిపోతారు.

## 11

తిమ్మమ్మ మరోసారి నర్మదను పరీక్షగా చూసింది. తన కూతురు నిప్పులో పడ్డ పువ్వులా ఉంటే, నర్మద సంసారపు వేడి తగలని విరిసిన పువ్వులా ఉంది.

"ఏం తిమ్మమ్మా, బదులు చెప్పవేం ?"

"మీరన్నదీ నిజమే తల్లీ. మాది చిక్కిపోయింది. పేదోళ్ళు ఎక్కడున్నా ఇంతేనండమ్మా. పెళ్ళి సేసుకున్నా, సేసుకోకపోయినా సుకంలేదు. కాని మా మీరమ్మగారికేం తక్కువయిందో సెప్పండమ్మా. శామప్పగోరు రానిలా సూసుకుంటారుగందా అరు గీసిన గీటు దాటరు గందా ........"

"నిజమంటే మీరా ?" నర్మద చిలిపిగా మీర వైపు చూసింది. విషాదపు తెర ఆమె మొహంలో కనిపించి మాయమయింది. బదులుచెప్పే సాహసం కలగలే దామెకు.

"కాని తిమ్మమ్మా, నువ్వు అన్నట్టు సంసారంలో అందరికీ కష్టాలే ఉంటాయనలేం. కాని మన పాలిటికి కష్టాలుండవని సుఖాలే ఉంటాయని ఏమిటి నమ్మకం ?"

"అయితే ఎన్ని రోజులు ఇలా ఉంటారు ?"

"ఎప్పటికీ ఇలాగే ఉండిపోతాను. చదివి ఉద్యోగము చేస్తాను. మగవాడికి బానిసగా బ్రతకడం నా కిష్టంలేదు."

"ఎట్టెట్టా ...." అంటూ ముక్కుమీద వేలేసుకుంది తిమ్మమ్మ.

"ఇక వస్తాం" అంటూ మీర స్నేహితులతో సాగిపోయింది.

ఇల్లు చేరేసరికి ఏడున్న రయింది. తొమ్మిదింటికి అందరి భోజనాలూ అయ్యాయి. మీర స్నేహితులకు పక్కలు వేయించింది.

చంప "మీరా, నువ్వు ఇక్కడే పడుకుందూ" అంది. మీర కూడా వాళ్ళతో కబుర్లు చెబుతూ పడుకోవాలనే ఉంది. నర్మద వ్యంగ్యంగా.

"చాల్లే వూరుకో మీర లేకపోతే వాళ్ళాయనకు నిద్రపట్టదు." అంటూ వేళాకోళం చేసింది.

"అలాంటిదేం లేదులే. ఇక్కడే పడుకుంటాను" అంది మీర.

"కాస్త వక్కపొడి ఇస్తావ్ ?" రాజా అడిగింది.

"తెస్తానుండు" అంటూ లేచి వెళ్ళింది మీర.

శాము గదిలో దీపం వెలుగుతోంది. శాము పక్కమీద కూర్చుని భార్యకోసం ఎదురు చూస్తున్నాడు. మీర తలుపు తోసుకుని లోపలికి వచ్చింది. శాము తలెత్తి ఆమె వైపు చూశాడు. ముడి విప్పి రంగు రిబ్బను కట్టుకుంది. స్నేహితులతో కలిసి తాంబూలం సేవించినందువల్ల గాబోలు పెదవులు మరింత ఎర్రనయ్యాయి. ఆమె నించున్న తీరు అన్నీ కలిసి శామును అమితంగా ఆకర్షించాయి. పల్లెకువచ్చినప్పటినుండి ఇంతవరకు మీర ఎన్నడూ ఇంత అందంగా కనిపించలేదనిపించింది.

మీర సౌందర్యం శాముకు మత్తు కలిగించింది. మెప్పుదలతో మత్తుగా ఆమెవైపు చూస్తున్న కళ్ళలో ఆ సౌందర్యాన్ని పొందాలన్న పిపాస కలిగి కళ్ళు ఎరుపెక్కి క్రూరమయ్యాయి.

మీర శాము మొహంలోని మార్పును గమనించి గడప దగ్గరే నుంచుంది.

"లోపలికి రావచ్చునే?"

మీర అక్కడే నిల్చుని "ఈరోజు నా స్నేహితులతోనే పడుకుంటాను. మీతో చెప్పి వెడదామని వచ్చాను" అంది.

"సరయితే ఓ గ్లాసెడు మంచినీళ్లు తెచ్చి పెట్టివెళ్ళు."

మీర కృతజ్ఞతతో అతనివైపు చూసి వంట గదిలోకి వెళ్ళి నీరు తెచ్చి టేబుల్‌మీద పెట్టింది. వెనక తలుపు గడియ వేసిన చప్పుడయింది. వణికిపోయింది మీర. రోషంతోను, దుఃఖంతోనూ ఏడుపు వచ్చిందామెకు. తలుపుకు అడ్డంగా నిల్చున్న శాముతో దీనంగా,

"మీకు దణ్ణం పెడతాను. తలుపు తెరవండి. అయిదు నిమిషాల్లో వస్తానని చెప్పివచ్చాను. ఇంటికొచ్చిన స్నేహితులముందు నన్నవమానంపాలు చెయ్యకండి." అంది.

శాము బదులు చెప్పకుండా ఆమెను తన వైపుకు లాక్కున్నాడు.

"వదలకపోతే అరుస్తాను"

కాని శాము వదలకపోయినా మీర అరవలేకపోయింది. స్నేహితులముందు అవమానం జరిగిందన్న కోపంతో అతడిని గిల్లింది, కొరికింది. శాము బుగ్గమీద రక్తం వచ్చింది. కాని అతడి భల్లూకప్పట్టునుండి బయటపడలేకపోయింది.

తన కోర్కె తీరగానే శాము మైకం ఒక్కసారిగా దిగిపోయింది పశువులా ప్రవర్తించినందుకు సిగ్గుతో కుంగిపోయాడు మీర రోషంతో ఏడుస్తూ నిల్చుంది. ఆమెను వోదార్చటానికి కూడా నోరు రాలేదు, శాముకు.

రేపు స్నేహితులకు ఎలా మొహం చూపను? వాళ్ళ చూపుల నెలా ఎదుర్కోను అన్న బాధతో క్రుంగిపోయింది. మీర స్నేహితులను పల్లెకు ఎందు కాహ్వానించానా అని మధనపడసాగింది. ఆమె ఏడుస్తూ ఉండటాన్ని గమనించి శాము,

"మీరా నాది తప్పయింది. కావాలంటే వెళ్ళు"

"నన్ను మాట్లాడించకండసలు" అంటూ మీర టేబుల్ దగ్గరకు వెళ్ళి గ్లాసులోని నీరు చేతిలోకి పోసుకుని మొహం తుడుచుకుంది. జుత్తు సరి చేసుకుని బయటికి వెళ్ళిపోయింది.

నర్మదావాళ్ళు పడుకున్న గది చీకటిలో మునిగి ఉంది. నెమ్మదిగా 'చంపా' అని పిలిచింది

"రా తల్లీ. నీ కోసం ఎదురుచూసి కళ్ళు కాయలు కాచాయి. పోకచెట్టు నాటడానికి వెళ్ళావేమోనని తైటార్పేశాం."

మీర నెమ్మదిగా "వక్కపొడి దొరకలేదే వెతికి తెచ్చాను. రాజా ఇదిగో వక్కపొడి" అంది.

"రాజెక్కడుందే ఇంకా? ఎప్పుడో స్వప్న సామ్రాజ్యంలో విహరించటానికి వెళ్ళిపోయింది. సుఖజీవి అంటే రాజా పేరే ముందు చెప్పుకోవాలి మీరా. తల కింద పెడితే నిద్ర, కావాలనుకున్నపుడు ఆకలి. అదృష్టమంటే తనదేనోయ్.

"అందరికీ కావాలనుకున్నపుడల్లా నిద్రరాగలదా ? అదీ ఓ వరమేనే! రాజు డికిన్స్ ఫెట్‌బాయ్ లాగా ఎప్పుడు కావాలంటే అప్పుడు ఎంతసేపు కావాలంటే అంతసేపు నిద్ర పోగలదు" అంది నర్మద.

"కాస్త చోటివ్వు నర్మదా."

నర్మద కొద్దిగా రాజువైపు జరిగి చంపకూ, తనకూ మధ్య చోటిచ్చింది. ముగ్గురూ కబుర్లలో పడిపోయారు. వాళ్ళు నిద్రపోయేసరికి గంట రెండయింది.

నర్మద మెలకువ రాగానే 'జీవన సఫనా టూట్‌గయా' అంటూనే లేచింధి. రాజు ఇంకా గుర్రు పెడుతూ నిద్రపోతోంది. చంపా, మీరా అంతకుముందే లేచారేమో పక్కంతా కాళీగా ఉంది.

కాఫీ ఫలహారాలయ్యాక మీర స్నేహితులను తమ చెరకు గానుగ ఆడుతున్న దగ్గరికి తీసుకుని వెళ్ళింది. వాళ్ళచేత చెరకు రసం త్రాగించింది. వేడి బెల్లం రుచి చూపించి ఇంటికి వచ్చేసరికి మధ్యాహ్నమయింది.

తన స్నేహితులువచ్చి రెండు రోజులయినా శాము వాళ్ళను పలకరించనేలేదు. తన స్నేహితుల

పెట్ల అతను చూపుతున్న ఉదాసీనత మీరను గాయ పరిచింది. కాని మనసులోని అసమాధానాన్ని పైకి కనపడనీయకుండా స్నేహితులతో నవ్వుతూ కాలం గడిపింది.

అయిదు రోజులు సరదాగా గడిచిపోయాయి.

ఇక మైసూరికి వెళ్ళిపోతామని పట్టుబట్టింది నర్మద. మీర కెంత ఇష్టం లేకపోయినా ఇక ఒప్పుకోక తప్పలేదు. వెళ్లేముందు నర్మద,

"ఏమోయ్, వెళ్ళేముందు మీ శ్రీవారితో వెడుతున్నామని చెప్పొద్దూ" అంది.

మీర శాము కూర్చున్న గది చూపింది. చంపా, నర్మదా, రాజా లోపలికి వెళ్ళి,

"వెళ్ళొస్తామండీ" అన్నారు.

"మంచిది" అన్నాడు చేతులు జోడించాడు శాము.

మీర స్టేషనుదాకా వెళ్ళి స్నేహితులకు వీడ్కోలిచ్చి వచ్చింది. ఆమె ఇంటికి తిరిగి వచ్చేసరికి శాము ఇంకా ఇంట్లోనే ఉన్నాడు. బండి ఆగిన చప్పుడు విని "మీరా" అన్నాడు. మీర లోపల కొచ్చింది.

"మీ స్నేహితులు వెళ్ళిపోయారా?"

"ఆఁ"

"నేను వాళ్ళ నేమంత ఎక్కువగా పలకరించలేదు. దానికి వాళ్లేమీ తప్పుగా భావించలేదు కదా?"

మీర వ్యంగ్యంగా నవ్వి "ఇంటి కొచ్చిన అతిథులను యజమాని పలకరించకపోతే అవమానంగా భావించటంలో తప్పు లేదనుకుంటా" అంది.

శాము నొచ్చుకున్నటుగా,

"ఆడపిల్లలతో మాట్లాడే అలవాటు లేదు నాకు" అన్నాడు.

మీర వెక్కిరింపుగా "అవధానిగా రమ్మాయి వెంకువస్తే మాత్రం కబుర్లకు అంతే ఉండదు."

"వెంకు, నేను ఎత్తుకుని ఆడించిన పిల్ల. మే మిద్దరమూ ఇక్కడేపుట్టి పెరిగిన వాళ్ళం. నీ స్నేహితులు ఇంకా ఇప్పుడే ఇంగ్లండునుండి వచ్చిన వారిలా పంచదారలో రాళ్ళు కలిపినట్టు కన్నడమూ ఇంగ్లీషూ కలిపి మాట్లాడతారు. నేను సరిగ్గా అర్థం చేసుకోలేక తప్పు తప్పుగా తెలుసుకోవటానికన్నా, దూరంగా ఉండటమే మంచిదికదూ?"

భర్త మాటలవల్ల, భర్త తనకన్నా తక్కువ చదువుకున్నవాడన్న సంగతి స్ఫురించి మనసుకు గాయం కలిగించింది. పెళ్ళయినప్పటినుండి భర్త తగినంత చదువుకున్నవాడు కాదన్న విషయం ఆమెను పదే పదే బాధిస్తూనే ఉంది. అందరు ఆడపిల్లల్లాగా మీర తన భర్త తనకన్నా ఎక్కువ చదువుకున్నవా డవ్వాలని సహజంగానే ఆపేక్షించింది. ఇప్పుడు ఈ మాటలవల్ల అతనిమీద ఒక విధమైన తిరస్కారభావం ఉదయించిం దామె మనసులో.

తన స్నేహితురాళ్ళు వచ్చిన రోజు రాత్రి, శాము జరిపిన అత్యాచారంవల్ల దైహిక సంబంధంమీదనే జుగుప్స కలిగిం దామెలో. మళ్ళీ తన స్నేహితులు వెళ్ళిపొయ్యేదాక గదివేపు తిరిగి చూడలేదామె. ఆ రోజున అతని ప్రవర్తన గుర్తుకొచ్చినపుడల్లా భార్యా భర్తలన్న ఈ బాంధవ్యాన్నే వదలిపెట్టి పారిపోవాలనిపించేది.

రాత్రి మౌనంగానే భోజనాలయ్యాయి. వంటింటిపని ముగించుకొని వెంకమ్మగారు పడుకొన్నారు. మీరచేతిలో ఓ పుస్తకం పట్టుకొని, హాల్లోని దీపపు మంద ప్రకాశంలో చదువుతూ కూర్చుంది. బయట పెంకులమీద పడుతోన్న వర్షపు చినుకుల శబ్దం వినిపిస్తోంది. శాము మీరకోసం కాస్సేపు ఎదురు చూశాడు. ఎంత సేపటికి మీర రాకపోయేసరికి ఆశ్చర్యంతో బయటికి వచ్చాడు చలికి వణుకుతూ, శరీరాన్ని ముడుచుకొని జోగుతోంది మీర. శాము ఆమె దగ్గరగావెళ్ళి భుజం తట్టి,

"మీరా, వచ్చి పడుకోవూ?" అన్నాడు.

"ఊహూఁ నేను చదువుకోవాలి."

శాము ఆమె చేతిలోని పుస్తకం లాక్కుని, చిన్నగా వెలుగుతూన్న దీపాన్ని వూది ఆర్పేశాడు.

"ఇక పదా."

"ఉహూఁ.....నేను....రాను. కథ చదువుకోవాలి."

"చలిగాలి కొడుతోం దిక్కడ."

"నాకేం చలి వేయటంలా."

"లేస్తావా లేదా?" కటువుగా అన్నాడు శాము.

మీర రాను రానంటున్నా వినకుండా శాము ఆమెను లేవదీసి, గదిలో పడుకోబెట్టాడు. మీర బెదరిన పసిపాపాయిలా పడుకుంది. శాము ఆమెకు రగ్గు కప్పి, కిటికీ క్రింద రెక్కలు వేసేసి తన పక్క మీదున్న శాలువా భుజంమీద వేసుకొని తలుపు



# భారీయెత్తున దేశరక్షణకు
# ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి అవసరం




## అధిక కాంతిగా ఉతుకుతుంది!

కొత్తవిధంగా తయారైన సన్‌లైట్‌కు సరికొత్త కాగితపు మూత; సుందరమైన కొత్త ఆకారంగలదు. అంతేగాక...దాని 'అధిక కాంతిగా చేసే శక్తి' ఉతుకుతుకునకూ మీ బట్టలను అతి కాంతిగా చేస్తుంది...

అధిక తెల్లగాను, అధిక కాంతిగాను ఉతుకుతుంది

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

S. 56-140 TE

దగ్గరగా వెళ్ళి ఒకసారి మీర వేపుచూసి బయటికి వెళ్ళాడు.

అతని ప్రవర్తన మీరను ఆశ్చర్య పర్చింది. ఆ రోజు పశువులా ప్రవర్తించిన భర్తకూ, ఈరోజు తనకు తానే గది విడిచి వెళ్ళిపోతూన్న భర్తకూ పోలికే లేదనిపించింది. అతని స్వభావపు తీరే అర్థం కాలే దామెకు. శాము తన బుద్ధి, వివేకాలకు లోబడి ప్రవర్తించటంకన్నా, భావోద్వేగం, అరిష డ్వర్గాలకు దాసుడై నడచుకుంటాడనుకుంది. తనకు ఆకలిగా ఉన్నపుడు, ఇంకొకరిని చంపేసి, వారి ఆహారాన్ని అపహరించేటంత క్రూరుడైనా తనకు ఆకలి వెయ్యనపుడు, తన ఆహారాన్ని ఇంకొకరికి దానంచేసే కరుణా హృదయుడు కూడ. అతను ఎంత మొరటుగా ఉండగలిగేవాడో అంతే మృదు వుగా కూడా ఉండగలడు. అని తెలుసుకుంది, మీర. తనకు కావాలనిపించినపుడు నొప్పించి క్రూరంగా ప్రవర్తించిన మనిషి ఈరోజు తనకు అక్కర్లేనపుడు ఆమె అనుమానాన్ని గ్రహించి, చలిలో వణుకుతూంటుందని వూహించి కరినంగా మాట్లాడి, లోపల పడుకోబెట్టి రగ్గు కప్పి వెళ్ళి పోయిన సన్నివేశం ఆమెను ఆశ్చర్య పరచింది.

ఉదయం మీర లేచే సరికే శాములేచి కాఫీ తాగు తున్నాడు. మీరను చూసి నవ్వుతూ.

"రాత్రి బాగా నిద్ర పట్టిందా?" అనడిగాడు.

మీర అతనివేపు పరీక్షగా చూసింది. అతని కంఠంలోగాని మొహంలోగాని లేశ మాత్రమైనా వ్యంగభావం కనిపించలేదు.

సంసార రథం ఎప్పటిలాగానే సాగిపోతోంది. జీవితంలో ఏ విధమైన వైవిధ్యతా లేకుండా నడచిపోతోంది. తాబేలు తన చిప్పలో తనే ముడు చుకపోయినట్టుగా, మీర తన మనసులో కల్పనా సామ్రాజ్యాన్ని నిర్మించుకుని, దానికి రాణియై రోజుకో రకమైన పగటి కల కంటూ కలలోలా జీవించసాగింది. రోజు రోజుకూ ఎక్కువైపోతోన్న ఆమె పరాధ్యానాన్ని గమనించాడు శాము.

శాము పొలం నుండి ఇంటి కొచ్చేసరికి మీర చేతిలో ఓ మాస పత్రిక పట్టుకొని కూర్చుంది. ఆమె కళ్ళు పుస్తకాన్ని చూస్తున్నా, మనసు అందమైన కల కంటోంది.

పెద్ద ఆసుపత్రి. తెల్లటి వస్త్రాలను ధరిం చిన నర్సులు గంభీరంగా అటూ ఇటూ తిరుగు తున్నారు. ఆపరేషన్ థియేటర్లో రోగిని పడుకో బెట్టారు. పెద్ద పెద్ద డాక్టర్లంతా ఆమెకు ఆప రేషన్‌చేసే ధైర్యంలేక వెనుదీస్తున్నారు డాక్టరు మీర తెల్ల జార్జెట్ కట్టుకొని, తెల్ల కోటు వేసుకొని వస్తుంది. డాక్టర్లంతా గౌరవంతో పక్కకు తప్పుకొని ఆమెకు చోటిస్తారు. మీర రోగిని పరీక్షించి జయప్రదంగా ఆపరేషన్ చేస్తుంది. సబ్బుతో చేతులు కడుక్కొని టవల్‌కోసం అక్కడే టవల్ పట్టుకు నిల్చున్న నర్స్‌వేపు చేయి చాస్తుంది

చాచిన చేతిని ఎవరో పట్టుకు లాగటంతో ఈ ప్రపంచంలో పడింది మీర. శాము ఆమె చేతిని పట్టుకొని "మీరా, మీరా" అని పిలుస్తు న్నాడు.

"ఏమిటి?"

"ఏమిటి ఆలోచిస్తున్నావు?"

"ఏంలేదే? చదువుతూ కూర్చున్నా."

"అబద్ధం. పుస్తకమైతే చేతిలో ఉందిగాని,

## అపస్వరం

నువ్వు మాత్రం చదవటంలేదు."

"లేదండీ. నిజంగా చదువుకుంటున్నా."

"ఏమీ తోచటంలేదా?"

"తోచకేం?"

శాము ఆమె మాటలను నమ్మలేదు. కాని నమ్మినట్టు నటించి,

"ఈరోజు నా స్నేహితులు శ్రీరాములు, వెంక టేశం వస్తున్నారు. రేపు వెళ్ళిపోతారనుకుంటా. వంటేం చేయిస్తావో చూడు"

శ్రీరాములు, వెంకటేశం, పక్క పల్లెలోని వారు. శాముకు వారితో చాలా రోజులుగా స్నేహం. ఏదో పనిమీద ఆ వూరికివచ్చిన వారిని భోజనానికి ఆహ్వానించాడా శాము.

పదింటికి శ్రీరాములు వెంకటేశాలను తీసు కొచ్చాడు. శాము. భోజనాలయ్యాక ముగ్గురూ డ్రాయింగ్ రూములో కూర్చున్నారు. వాళ్ళమధ్య తమలపాకుల పళ్లెంలో కట్ట తమలపాకులు పావు శేరు వక్కలూ ఉన్నాయి. కబుర్లు చెప్పుకుంటూ తమలపాకులు వేసుకోసాగారు. కట్ట తమలపాకులు ఎలా చాలుతాయి?

"ఇంకాస్త తమల పాకులు తెప్పించవయ్యా శాము."

"మీరా, కాస్త తమలపాకులు వక్కలు పట్రా' శాము కూర్చున్న చోటినుండే కేకేసాడు.

మీర ఆకులు, వక్కలు పళ్లెంలో పెట్టు కుని డ్రాయింగ్ రూములో అడుగు పెట్టింది అక్కడి దృశ్యంచూసి నోట మాటరాక అలాగే నిలబడి పోయింది

శ్రీరాములు, వెంకటేశం సోఫాలో తమ మురికికాళ్ళు పైన పెట్టుకుని కూర్చున్నారు. సోఫా కవర్ సున్నపు మరకలతోనూ, లాంబూ లపు ఎర్రటి చుక్కలతోను, నిండివుంది క్రింద నున్న తివాసిమీద తమలపాకుల ఈనెలూ, బీడీ ముక్కలూ పడిఉన్నాయి. ఒకచోట పీల్చి పార వేసిన బీడి ముక్కలోనుంచి ఇంకా పొగ వస్తోంది. మీర దాని దగ్గరగా వెళ్ళి చూసింది. పూర్తిగా ఆరని బీడి ముక్కలోని నిప్పు, రత్నకంబళిమీదున్న ఒక పువ్వు భాగాన్ని కాల్చివేసింది. మీర ఆ నిప్పును కాలితో రాచి, ఆర్పేసి, భర్తవేపు తీక్షణంగా చూసి వెళ్ళిపోయింది.

శాము స్నేహితులు వెళ్ళిపోయాక, భర్తతో దెబ్బలాడింది.

"చంపా, రాజు వచ్చినపుడు ఇంటి తలుపులూ, దూలాలకంతా 'జీవన నవనా టూట్‌గయా' వచ్చే సింది, అన్నారే ఇప్పుడు చూడండి. సోఫా, తివా సీల జీవితాలకే ముప్పు వచ్చింది."

"నన్నేం చేయుమంటావు మీరా? వాళ్ళకు నే నెలా చెప్పను?"

"క్రింద బీడీ ముక్కలు వేయకండని చెప్పే సున్నం రాయడానికి మీ టవల్ ఇవ్వాల్సింది"

"అలా చెప్పలేకపోయాను. రాక రాక వచ్చారా? అలా చేయకు, ఇలా చేయకు అని చెప్పగలనా?"

"నన్నడగ లేకపోయారా? ఒక రేకు పళ్లెం ఇచ్చి ఇదే 'అష్‌ట్రే!......" అనే దాన్ని—

ఆర్పని బీడీ ముక్క క్రింద పడేస్తారని వూహించలేదు నేను."

మీర కాలిపోయిన రత్న కంబళి భాగాన్నిచూసి "అన్యాయంగా పాడైంది" అంటూ గొణిగింది.

వారం రోజులుగా మీర వంట్లో బాగుండటం లేదు. స్నానం చేసేటపుడు వేడి నీరు వంటిమీద పడేసరికి, కళ్ళు తిరిగి చీకట్లు కమ్మాయి. మెల్లిగా తేరుకొని ఎలాగో స్నానమయిందనిపించి బయటికి వచ్చింది జడ వేసుకొని బొట్టు పెట్టుకోవటా నికి అద్దంముందు నుంచున్నప్పుడు కంటిచుట్టూ నల్లగా ఏర్పడిన వలయాన్ని మొదటిసారిగా గమ నించింది, మీర. వేలితో కంటిచుట్టూ ముట్టి చూసుకుంది. ఎర్రగావున్న వేలు, తెల్లగా పాలి పోయినట్టుండటం చూసి "ఇదేమిటి ఇలా అయ్యాను?" అనుకుంటూ తన చేతులమీదికి దృష్టి పోనిచ్చింది. తను చిక్కిపోయిందన్న సంగతి స్పష్టంగా తెలిసి వచ్చిందప్పుడు. బిగుతుగావుండే చోళీ చేతులు ఒదులుగా ఉన్నాయ్.

(సశేషం)



# విశ్వావసు ఉగాదికి MSCo వారి విశేష కానుక

## తెలుగు సాహితీ సౌరభ, సౌందర్యాలకు వాచవి



అసలు తెలుగులిపి మొదలైనప్పటినుంచి ఆధునిక యుగందాకా సుమారు 2000 ఏండ్ల సాహిత్యాన్ని అందికగా, పొందికగా పన్నెండు సంపుటాలలోకి కుదించి....






ఏ పాఠకుడికైనా - సాధారణ పాఠకుడు గాని, సాహితీపరుడుగాని - సమగ్ర ఆంధ్ర సాహిత్యంతో సన్నిహిత సంబంధం ఏర్పరాలని...



ప్రాచీన, నవీన సాహిత్యాలలో ప్రామాణికంగా ఆరితేరి, ప్రజాకవిగా, ప్రజారచయితగా ప్రజాసామాన్యంలో పటిష్ఠ ప్రతిష్ఠ సంపాదించుకొన్న సవ్యసాచి సాహితీమూర్తి శ్రీ ఆరుద్ర నిర్వహిస్తున్న....

చెప్పుకోదగ్గ కవుల కథలూ, వారి కావ్యాల సౌందర్య, సౌరభాల వివరణ

సాహిత్య ప్రాడ్వివాకుడు డా॥ రాజమన్నారు గారి ఉపోద్ఘాతంతో

పన్నెండు సంపుటాలలో

రమారమి 3000 పుటలు

పాఠకప్రజా సామాన్యానికి విశ్వావసు ఉగాది కానుకగా యం. శేషాచలం అండ్ కో ముద్దుగా, ముచ్చటగా ప్రచురణగావించి...

క్యాలికో అట్టలో, కంటికింపైన కూర్పు తీర్పుల.....






యం. శేషాచలం అండ్ కో

మచిలీపట్టణము, సికిందరాబాదు, మద్రాసు. MSCo

వాశిరాజు ప్రకాశం

మన చుట్టూ ప్రపంచం

# తిండి కోసం తిప్పలు

ఫోటోలు: ప్రభాకర్



కారియర్లలో మిగిలిన అన్నాన్ని కొందరు మళ్ళీ అమ్ముకుంటారు.

కాలచక్రం వేగంగా తిరుగుతుంటే, దానిచుట్టూ ప్రపంచం కూడా పరిభ్రమిస్తుంటుంది. కర్మాగారాలు నిర్విరామంగా పనిచేస్తూ, తమ శ్రమకు నిదర్శనం అన్నట్లు నల్లని పొగను గాలిలోకి వదలేస్తున్నాయి. రైళ్లు నడుస్తున్నాయ్, రోజులు పరిగెడుతున్నాయ్. వీటితో బాటు నిత్యజీవితంలో మానవుని దైనందిన కార్యక్రమం కూడా సాగిపోతుంటుంది.

ఉద్యోగాలకు వెళ్లేవారు వెళుతుంటే, ఆ ఉద్యోగులకు భోజనం అందించేందుకు వెళ్లేవారు మరికొందరు మధ్యాహ్నంవేళ సరిగ్గా ఆఫీసుల విరామ సమయానికి ప్రతి ఆఫీసు ముందు కనుపిస్తారు ఎందరో ఆడవాళ్ళు

నెత్తిన బుట్టలో పదో, పన్నెండో క్యారియర్లు పెట్టుకొని చకచక నడుస్తుంటారు. కొందరు యీ క్యారియర్ బుట్టలను రైళ్లలోను, మరికొందరు బస్సులలోను తీసికొస్తూ ఉంటారు. కొందరు దూరాన ఎక్కడో పది మైళ్లలోవున్న పరిసర ప్రాంతాలనుంచి కూడా తీసికొస్తుంటారు.

కేవలం ఇలా క్యారియర్‌లను పట్టుకొస్తూ తద్వారా జీవించేవారు ఒక్క మద్రాసు నగరంలోనే 30 వేలమందికిపైగా ఉన్నారు. ప్రతి ఒక్కరూ ఎన్నెన్నో క్యారియర్‌లను మోసికొస్తూ ఉంటారు

మద్రాసులాంటి పెద్ద పెద్ద నగరాల్లో కొన్ని కార్యాలయాలు 8 లేక 9 గంటలకు ఆరంభమయ్యినా, మరికొన్ని కర్మాగారాలు మ్నాతం ఆరు గంటలకే మొదలవుతాయి ముఖ్యంగా రైల్వే శాఖకు చెందిన కర్మాగారాలు, స్థానికంగా ఉన్న ఇతర పెద్ద ఫ్యాక్టరీలు, ప్రైవేటుగా నడిచే సంస్థలు చాలా పెందరాళే తమ రోజును ప్రారంభిస్తాయి అంటే ఉద్యోగుల ఉద్యోగపు జీవితం కూడా చాలా ముందుగానే మొదలవుతుందన్న మాట ఇలాంటి స్థితిలో ఉదయం భోజనం చేయటానికి గాదుగదా, ఒక్కో మారు టిఫిన్ చేయటానికి కూడా వ్యవధి ఉండదు అందువల్ల వీళ్ళందరికి భోజనపు సమస్య పరిష్కారమయేం



సైకిళ్లూ, కారియర్లూ...!

దుకు అనువుగా ఈ కారియర్ల రవాణా, ఇలాంటి పెద్ద నగరాలలో చురుకుగా సాగుతుంది

*    *    *

'ఈ భాగ్యానికే ఇంత వ్యాసం వ్రాయాలా?' అని ఎవరైనా సహృదయులు అడగొచ్చు

ఈ క్యారియర్ల వనితల కథలు విన్న తరువాత వీళ్లను గురించిన విశేషాలు, వింతలు తెలిసిన తరువాత ఇవన్నీ అందరికీ చెప్పాలనిపించింది ఓ శుభ ముహూర్తాన నేనూ, ప్రభాకర్ ఒక కూడలి వద్ద కూర్చొని కొంతసేపు గడిపాం ఈ కొద్ది నిమిషాల్లో మరికొన్ని విశేషాలు తెలిసికోవటం, మరికొన్ని వింతలు చూడటం జరిగింది. ఇదీ 'మన చుట్టూ ప్రపంచం' కాబోలు ననిపించింది

*    *    *

ముప్ఫయివేలకుపైగా ఉన్నారు వీళ్లు ముప్ఫయి వేలలో రెండున్నర వెయ్యిమంది మాత్రం మగవారు ఈ మగవారిలో రెండువేల నూరుమంది 18 సంవత్సరాలలోపు వయస్సు కలిగిన అబ్బాయిలు అంటే మొత్తంమీద స్త్రీలు అత్యధిక సంఖ్యాకులు!

వీళ్లు జట్లు జట్లుగా ఏర్పడతారు ఇది కేవలం రవాణా సౌలభ్యం కోసమే ఉదాహరణకు ఒకామె అందచేయవలసిన కారియర్లకు సంబంధించిన వ్యక్తులు విసిరి వేసినట్లు తలా ఒక ప్రాంతంలో ఉంటారనుకోండి అలాంటప్పుడు ఈ రవాణా చాలా కష్టం అసంభం కూడా అందువల్ల మవుంట్‌రోడ్‌కు వెళ్లే క్యారియర్లన్నీ ఒకరు తీసికొంటారు టౌన్‌కు వచ్చే క్యారియర్లన్నీ మరొకరు తీసికొంటారు ఇలాగే ప్రాంతాల వారీగా పంపిణీ జరుగుతుంది

వీళ్లకు ప్రతి నెలా ఇవ్వవలసిన ప్రతిఫలం కూడా దూరాన్నిబట్టి, ఒక్కొక్కమారు అధికారుల హోదానుబట్టి మారుతూ ఉంటుంది రు 2 50 పైసలు మొదలు పది రూపాయలవరకు ఇచ్చేవారుంటారని చెప్పింది ఒకామె!

ఈ ప్రతిఫలంమీదకంటె క్యారియర్‌లలో మిగిలే భోజనంమీదనే కొందరు ఆధారపడతారట ఈ భోజనంతో కొందరు మధ్యాహ్నం సమయంలో వ్యాపారం చేస్తుంటారు పది క్యారియర్‌లలో మిగిలే భోజనాన్ని కలిపి వీరు బిచ్చగాళ్లకు, రిక్షావాళ్లకు అమ్ముతుంటారు అందువల్ల రోజుకు సుమారు రెండు రూపాయలు వస్తాయి

క్యారియర్‌ల రవాణాలో తమాషా లెన్నో జరుగుతూ ఉంటాయి ఒక్కోమారు రైళ్లుగాని, బస్సులుగాని ఆలస్యమయితే ఒంటిగంటకు రావలసిన క్యారియర్‌లు రెండున్నరకు, మూడు గంటలకు వస్తాయి ఒక్కోసారి ఒకరి క్యారియర్‌లు మరొక మరొకరికి వస్తాయి కొన్ని క్యారియర్‌ల గిన్నెలు ఒకదాని కొకటి మారిపోతుంటాయి

ఇలా భోజనం రవాణా జరిగేది ఈ ఒక్క మద్రాసు నగరంలోనేకాదు అన్ని చోట్లా ఉన్నది మద్రాసు వెలుపలగాఉన్న పెరంబూర్ కోచ్ ఫ్యాక్టరీ, లోకోవర్క్స ప్రాంతానికి మధ్యాహ్నం వెళ్లితే వీళ్లంతా 'తిరునాళ్ల'లా కనిపిస్తారు ఇలాంటి వ్యాపారం హైదరాబాద్‌లో చాలా తక్కువ మళ్లీ బెంగుళూరులో ఎక్కువే మధ్యాహ్నం వేళ ఒక్కమారు హెచ్ ఎం టి వైపు వెళ్లితే వందలమంది కుర్రాళ్లు సైకిల్ వెనుక భాగాన, ముందు కూడా దాదాపు డజను



యాంత్రిక జీవనంలో ఒక ఘట్టం.

కారియర్‌లను తగిలించుకొని రివ్వున పరుగులు తీస్తున్న దృశ్యం కనుపిస్తుంది. బొంబాయిలో కూడా ఈ క్యారియర్‌ల రవాణా ఉన్నంతలో ఎక్కువగానే జరుగుతూ ఉంటుంది.

ఈనాడు మద్రాసులో ఈ వ్యాపకంతో వేలు గడించిన వారున్నారు. కాని, ఆ మాట ఎవ్వరూ ఒప్పుకోరు.

నేనూ, ప్రభాకర్ ఒకామెతో మాట్లాడాం. ఆమె ఎంతో తెలివిగా మాట్లాడింది. ఉద్యోగాలు చేసేవారంతా అన్నంలేక ఇబ్బంది పడకుండా ఉండేందుకే తాను ఈ వృత్తిని అవలంబించానని ఆ వనిత కథనం. పైగా, వీళ్లిచ్చే మూడో నాలుగో కూటికొస్తాయా, గుడ్డకొస్తాయా అంటుందామె.

ఇలాంటివాళ్లేకాక, తాముచేసే ఈ పని కేవలం తమ కోసమేనని అంగీకరించేవారున్నారు. "తిండి కోసమే ఈ తిప్పలన్నీ" అంటుందొక నలుగురు బిడ్డల తల్లి.

మా ఎదుటనే ఒక చిన్న విచిత్రం జరిగింది. ఒకామె—పాపం వృద్ధురాలు—పది కారియర్లను గంపలో పెట్టుకుని, ఆ గంపను నెత్తిన పెట్టుకొని బస్సులోనుంచి దిగబోతూ కాలు జారింది. క్యారియర్లన్నీ బోర్ల పడ్డాయి. ఆ తరువాత ఏం జరిగి ఉంటుందో మీరే వూహించవచ్చు! ★



ఎండలో నిరీక్షణ...

# పలుకని స్వరాలు

32 వ పేజీ తరువాయి

దీవించారు—కానీ ఈనాడు ..

ఆరోజున డిస్పెన్సరీ నుంచి తిన్నగా ఇంటికి వచ్చాడు శ్రీనివాసరావు అప్పటికి కొత్తగా ప్రాక్టీసు పెట్టిన రోజులు మనిషి ముభావస్తు డైనా మంచివాడని, ఆయన వద్దకు వచ్చే వాళ్ళను కునేవారు ఇంటికి వచ్చి కాస్సేపు విశ్రాంతి తీసుకుని స్నానాదికాలు ముగించుకుని భోజనాని కుపక్రమించాడు అదే సమయంలో యిద్దరమ్మా యిలు వచ్చారనీ, బయట అతని కొరకు వేచి ఉన్నారనీ చెప్పాడు వంటమనిషి భోజనం అయిం తర్వాత వాళ్ళిద్దర్నీ చూశాడు. ఒకమ్మాయిని చూచి 'చాలా బాగుందను' కున్నాడు కానీ విచిత్ర మేమిటంటే దాదాపు ఒక గంట వరకూ వాళ్ళిద్ద రిలో ఎవరూ మాట్లాడలేదు మాటకు తట పటాయిస్తున్నారని తెల్సుకున్నాక యిహ అతనే అడిగాడు 'ఎందు కొచ్చా' రని ఆ రెండో అమ్మాయి ఏదో చెప్పబోయింది పెదవి కదిలింది కానీ మాట విన్పించలేదు గొంతులో మాట గొంతులోనే ఉండిపోయింది అందమైన అమ్మాయికేసి చూశాడు తలవొంచుక్కూర్చుని యే భావమూ తెలియనివ్వలేదు కాదు అతనికి విసుగనిపించింది లేచాడు. అప్పుడు గాని ఆ రెండో అమ్మాయి మాట్లాడలేదు !

"డాక్టరుగారూ చాలా ముఖ్యమైన పనుండి వచ్చాము ఎంతో ప్రమాదకరమైంది దయచేసి దీన్ని అతి రహస్యంగా ఉంచాలి"—అని ఆగింది ఆ అమ్మాయి మాటలు వింటుంటే నాటకంలో నటన చేతకాని నటుని సంభాషణ మాదిరిగా తోచిందతనికి కానీ, ఎందుకో అతనికక్కడా వాళ్ళమీద వాళ్ళ తీరు చూచి జాలి కలిగింది వెనువెంటనే ఒక అనుమానం కూడా మొల కెత్తింది తీరా అదే నిజమైంది

అయితే అతన్ని ఏ సహాయం కోరి వచ్చారో ఆ సాయం చేయటానికి అతను సుముఖత చూప లేదు పాపభీతి చేతనో మరెందుచేతనో మరి శ్రీనివాసరావు ఆ సమయంలో అనగలిగిందల్లా— "రెండురోజు లాగి రండ' ని అలా ఎందుకన్నాడో అతనికి జీవితంలో అంతుదొరకని ప్రశ్న ఆ రెండు రోజులూ చాలా ఆలోచించాడు అసలాలోచించ లేదేమో కూడా• ఎందుకంటే అత నేదైనా పని చేస్తే అడ్డగించేవా ళ్ళెవరూ లేరు అతనాలోచిం చిన దల్లా "ఏం చెయ్యాలి"—అని ఏంచెయ్యాలో అవును—కాదు అనే రెండు మాటల్లో ముగించ వచ్చు ఆ రెంటిలో ఏది ఎన్నుకోవాలో సమస్యగా ఘనీభవించిందా రెండు రోజుల వరకూ— మూడోనాడు, జీవితంలో అత్యంత ప్రాధాన్యత వహించే విషయంపైన లాటరీ వేశాడు— రూపాయిమీది రెండు బొమ్మలూ—పిల్లల 'చిత్తూ —బొత్తూ' ఆట జ్ఞాపకాని కొచ్చిందా సమ యాన అదే తనూ ఆడాడు సమస్య తీరింది అతనా అమ్మాయిని పెండ్లాడాలి దీనికి సమాధాన పడటం అతనికి తేలికే అనిపించింది "వయసులో ఉన్నది. ప్రకృతిసిద్ధమైన వాంఛను అరికట్టలేక పోయింది ఒకే ఒక్కసారైనా మాతృత్వం వహిం చక తప్పలేదు కాబట్టి ఆ అమ్మాయి తప్పు తప్పుల్లో• జమకాదు"—ఇది అతని అంతరత్మకు అతనిచ్చిన సంజాయిషీ అతనిలో పరస్పర విరుద్ధ భావాలు ఎప్పుడూ మొలకెత్తలేదు అందుకే యీ జవాబులో సంతృప్తిపడిందతని మనసు

ఆ తర్వాత వారం రోజులకు అన్నపూర్ణ స్నేహితు రాలి తెలివివల్లనైతేనేమి, శ్రీనివాసరావుతో సంబంధం తమ అదృష్టమని ఆమె తలిదండ్రు లనుకోవడంవల్లనైతేనేమి— ఇద్దరికీ వివాహం జరిగింది దురదృష్టవశాత్తూ అన్నపూర్ణ మొదట శిశువును ఎత్తుకోలేదు పురిటిలోనే పోయిందా శిశువు మరో రెండు సంవత్సరాల సంసారిక జీవి తంలో నిరుపమ పుట్టింది నిరుపమకు నాలు గేళ్ళు వచ్చేసరికి అన్నపూర్ణకు శ్రీనివాసరావుతోటి కాపురం చేయటం గగనమైపోయింది 'ఏడు సంవత్స రాలు ఎలాగో దొర్లినై— కానీ ఒక్క క్షణం ఇకముందు గడవదు'—ఈ ఆలోచనే ఆమెను అతనినుండీ వేరుచేసింది ఆమె పోయి మరెవరితో నైనా ఉందో లేక పోయిపోయి ఎక్కడైనా ఆత్మ హత్యే చేసుకుందో గాని ఒకనా డామె హఠాత్తుగా కన్పించటం మానివేసింది లోకం దృష్టిలో మటుకు 'డాక్టరుగారి భార్య లేచిపోయింది'— వాస్తవంలో అన్నపూర్ణకు శ్రీనివాసరావంటే భక్తి శ్రద్ధలు వనలేనివి ఆమె చేసింది లోకానికి చెప్పి చేస్తే ఎంతైనా జాలిని చూరగొనేది. ఆమె బిడ్డకు ఆదరణ లభించేది శ్రీనివాసరావు ఆమె దూరమైందని విచారించాడే గానీ, ఆమె ఈవిధంగా చేస్తే తన గౌరవం తనకు దక్కేదని ఏనాడూ సంకుచితంగా అభిప్రాయపడలేదు.

కిటికీలోనుండి చల్లని గాలి లోపలికి వచ్చి చిరు చెమటలో ఉన్న అతని ఫాలభాగాన్ని తాకింది ఈరోజున శ్రీనివాసరావును పూర్వ స్మృతులు ఆవరించిన యీ సమయంలో అప్పుడప్పుడూ జరు గుతూ వచ్చిన విచిత్రమే ఇప్పుడూ జరిగింది పదిహేనేళ్ళనాటి సంగతులు నెమరువేసుకొంటున్న అతనికి ఎదురుగా నున్న గుమ్మంలోనుంచి తెల్లటి బట్టల్లో తల వెంట్రుకలను చేతితో సవరించు కుంటూ గదిలోకి రావటం కన్పించింది. ఒక క్షణం, వస్తున్నది అన్నపూర్ణా ? లేక నిరుపమా అనే అనుమానం వొచ్చి వళ్ళు ఝల్లుమన్నది. ఖంగారుగా లేచి ఎవరు నువ్వు నిరుపమవా అన్న పూర్ణవా అంటూ ఒక అడుగు వెనక్కు వేసి కుర్చీలో కూలబడ్డాడు. ఇలా అప్పుడప్పుడూ జరుగుతుంటుంది.

పైకి వచ్చే మెట్లపైన అలికిడి అయింది. ఎవరో వొస్తున్నట్లుగా భారమైన అడుగుల సవ్వడి విన్పించింది. అతని గుండె వేగంగా కొట్టు కుంది కుర్చీనిఅంటిపెట్టుకుని కళ్ళుమూసుకున్నాడు.

అదే సమయంలో ఎవరో ఒక మనిషి వచ్చి చీకటిగా ఉండటం మూలాన అగ్గిపుల్ల వెలిగిం చాడు ఎదురుగా కళ్ళుమూసు క్కూర్చున్న డాక్ట రును చూచి విచారం వెలిబుచ్చుతూ స్విచ్చి వేశాడు ఆ కాంతిలో డాక్టరు కంటినీరు స్పష్టంగా కన్పించిం దతనికి

"అయ్యా—ఎవరో వొచ్చారు"—డాక్టరు ఉలికి పడి చూశాడు ఎదురుగా కృష్ణమూర్తిగారు. అతను పూర్తిగా యథాస్థితికి రావటానికి రెండు నిముషాలు పట్టింది. "మూర్తిగారూ భోజనం అయిందా—వదండి, వొస్తున్నాను"—

"తమకోసం ఎవరో వచ్చారండీ,—లైట్లు వెలిగించలేదేం"

"వీరయ్య లేడా'"—

లైట్లు వెలిగించడం దగ్గర్నుంచి ఇంటి పనంతా వీరయ్యే చేస్తుంటాడు దౌర్భాగ్యుడు యివాళ రాలేదు

"రాలే దివ్వాళ"—భోజనం చెయ్యకుండానే ఆ వొచ్చిన మనిషితో డాక్టరు బయల్దేరాడు ఆ మనిషేదో చెప్తున్నాడు కానీ, అతని సొద డాక్టరు చెవులలోకి వెళ్లటం లేదు అతని మెదడు ప్రస్తుతాన్ని పరికించ నిరాకరిస్తున్నది ఆలోచన్లు గతంలోకి— అతని వైవాహిక జీవితంవైపు ధారితీసినవి. పమీపాన



ఎక్కడో వర్షపుజల్లు పడిందేమో చల్లని గాలి వీస్తున్నది తనతో మరో వ్యక్తి ఉన్నాడనే మాటే మర్చిపోయి కారును చాలా నెమ్మదిగా పోనిస్తూ ఆలోచనల్లో మునిగిపోయాడు గతించిన సంఘటన లన్నీ కలగా పులగంగా వుండి కొంతసేపటికి ఒక చోట ఆగిన్నై.

ఆరోజు అనూ అన్నపూర్ణా యిద్దరూ కలిసి దగ్గర్లోవున్న గ్రామానికి ఆహ్వానితులై వెళ్లారు. తనెప్పుడూ ఏ సమయంలో కూడా పెదవి కదిల్చి మాట్లాడి ఎరగడు అన్నపూర్ణ మాత్రం తన వంతూ తన భర్త వంతూ తనే కబుర్లు చెప్పింది. ఎందుకో అవాళ అన్నపూర్ణలో నూతనమైన అందం వెల్లి విరిసిందనిపించింది శ్రీనివాస రావుకు వాళ్లక్కడినుండి బయల్దేరేసరికి రాత్రి దాదాపు పది గంటలు కావొచ్చింది

సగం దూరం వచ్చాక కారాపమని కోరింది అన్నపూర్ణ అతి నాపాడు ఇద్దరూ కారు దిగి రోడ్డు ప్రక్కనే ఉన్న చేను దుక్కిలో కూర్చు న్నారు పండువెన్నెల అకాశం స్వచ్ఛంగా ఉంది ప్రక్కనే ఉన్న భర్త వొడిలో వాలిపోయింది అన్నపూర్ణ ఆ సమయంలో ఏదో చెప్పాలనీ ఆ ఆనందాన్ని ఇద్దరూ పంచుకోవాలనీ వ్యక్తం చేసె ఆమె చూపులు అతని కర్థంకాలేదు అయినా నిరుత్సాహ పడక అన్నపూర్ణ చెప్పింది—తను తల్లి కాబోతున్నట్టు—అతనేమీ అనలేక 'అలాగా' అన్నట్టు మాత్రం చూశాడు ఈ సువార్త విని భర్త ఎంతో సంతోషిస్తాడనీ, ఏదో అంటాడనీ, ఆ సమయంలో తనను గాఢంగా దరిజేర్చుకుంటా

ఆ మహిళా సంఘం లో మెంబరుగా జేరేవాళ్ళు తమ కరెక్టు పుట్టింతేదీ ఇవ్వాలిట! -- నేం జేరలాం!

# పలుకని స్వరాలు

డనీ—ఏవేవో వూహించిన అన్నపూర్ణ హతాశు రాలైంది అతను మాత్రం నిశ్చలంగా నిర్మామ్మల మైన ఆకాశంకేసి చూస్తుండిపోయాడు

తమ దాంపత్య జీవితానికి ప్రతిరూపంగా—చిహ్నంగా, యిరువురి రక్తాన్నీ పంచుకుని పుట్ట బోయే పాపాయి అతన్ని ఏవిధంగానూ చలింపచేయ జాలకే పోయింది తనెందుకలా ఏ విషయానికైనా రాయిలాగా వుంటాడో అతనికేనాడూ అర్ధంకాదు. యిన్ని సంవత్సరాలుగా ఆ పాపాయి పెరిగి పెద్దదై యీనాడు యిరవై సంవత్సరాల యువనవతి అయింది యీనాటికీ తన ప్రవర్తనే అలాగేవుంది ఏనాడూ కూతుర్ని ఆప్యాయంగా దగ్గరకుతీసుకొని 'అమ్మా' అని ముద్దుగా పిల్చి ఎరుగడు కనీసం ఆమె యోగక్షేమాల ఎడ కూడా ఎన్నడూ శ్రద్ధ కనబర్చినట్టులేదు తనిన్నాళ్లు కేవలం యాంత్రికంగా బ్రతికాడు చిన్ననాడు తలిదండ్రులు దుఃఖించారు యవ్వనంలో భార్య నిండైన దాంపత్యసుఖం అనుభవింపనోపక కుమిలియేడ్చి ఒకనాడు శలవు తీసుకుంది యీరోజు వరకూ తన వాత్సల్యం బిడ్డపైన ప్రసరింపలేదు .

నడన్ బ్రేకుపడింది అంతలోనే వెనుకనున్న మనిషి దిగడమూ డాక్టరు సీటు తలుపు తెరవడమూ జరిగింది దిగాడు దిగి అతన్ననుసరించాడు వరండాలో చాలామంది చేరివున్నారు లోపలికి వెళ్లాడు మంచంపై ఒకావిడ బాధతో మెలికలు తిరిగి పోతున్నది ఆ సరికి డాక్టరు ఆలోచన్లను పూర్తిగా వొదిలిపెట్టాడు

ఆమెను బాగా పరీక్షించాడు.

"డాక్టరుగారూ ఆపరేషను అవసరమంటారా"—అతనిగొంతులో ఖంగారు— మనిషి బెదిరి పోతు న్నాడు

'అవసరంలేదు'— 'మరేం భయంలేదు కాన్పు సులభంగానే జరుగుతుంది'

ఎదుటిమనిషి కళ్లలో సంతోషం, సంతృప్తీ—గర్వం తొంగిచూచిన్నై

వీటిలో యే వొక్కటీ—అలా తనలో ఆనాడు అన్నపూర్ణ ఆసంగతి చెప్పినప్పుడు లేవు ఎందుకు లేవనే ప్రశ్నకు యీనాటి వరకూ సమాధానం దొరక లేదతనికి యికమీదట దొరికినా అది అనవసరం

తెల్లవారుఝాము మూడుగంటలకు కాన్పు సులభంగా జరిగింది ఆమనిషి కృతజ్ఞతతో డాక్ట రుకు నమస్కరించి చేతిలోని అయిదునోట్లు పదిరూపాయిలవి — అందివ్వబోయాడు అతని చేతిని వారిస్తూ డాక్టరు కారెక్కాడు

ఇంటికి బయల్దేరిన డాక్టరుకు కూతురుపైని ఎనలేని ఆపేక్ష వెల్లువై పొంగింది ఈనాటి నుంచీ కంటికి రెప్పలా చూచుకోవా లనుకున్నాడు బిడ్డను ఈరోజు వరకూ తమ యిద్దరి మధ్యనా, ఎవరి తప్పూ ఎవరి ప్రమేయం లేకుండానే నిర్చిన అడ్డుగోడల్ని యీ క్షణాన్ని కూల్చివేయాలి.

ఇంతకాలంగా తనలో ఉన్న అనాదరణకూ, అనాసక్తతకూ అశ్రద్ధకూ బిడ్డనే క్షమాపణ కోరుకోవాలి తను క్షమింపబడితేనే గానీ తన పాపా నికి నిష్కృతి ఉండదు

"నా తల్లి కాళ్ళపై బడినా దేవుడు నన్ను పాపం నుంచి రక్షించడు" బిడ్డకోసం అతని హృదయం ఆక్రోసించింది అతనిపై అతనికే కోపం, అసహ్యం కలిగాయి—మరుక్షణంలో ఇంట్లో ఉండే బిడ్డను చేతుల్లోకి తీసుకోవాలి 'ఇది భోజ నపు వేళైతే తాను కలిపి తన చేతితో బిడ్డ కన్నం పెట్టవచ్చ' నుకున్నాడు

* * *

ఇంట్లో అడుగు పెట్టేసరికి గడియారం తొమ్మిది గంటలు కొట్టింది తండ్రి గదిలో లైటు వెలుగుతూనే ఉన్నది గుమ్మంలోంచే 'నాన్నా' అనుకుంటూ ముందుకు వెళ్లింది నిరుపమ. ఇరవై సంవత్సరాలుగా ఆమె హృదయంలో ఉండి పోయిన గౌరవం, అభిమానం చనువులు ఆ పిలు పులో మిళితమై ఉన్నవి కుర్చీవైపు చూసేసరికి తండ్రి అక్కడ లేడు. వంట మనిషిని పిల్చింది. కొద్దిసేపటికి అతనొచ్చి చెప్పాడు డాక్టరుగారు అప్పుడే బయటకు వెళ్లారని.

"కృష్ణమూర్తిగారూ, మీరు వెళ్లి పడుకోండి. నాన్న వచ్చాక మే మిద్దరం భోజనం చేస్తాం"—అన్నది మూర్తిగారి కిదేమీ అర్థంకాలేదు అతనీ యింటికి వచ్చి ఇంతకాలం గడిచినా తండ్రీ, కూతుళ్ళు కలిసి భోంచేసినది ఎప్పుడూ చూడ లేదు అందుకే అతను అమితమైన ఆశ్చర్యానికి లోనైనాడు వింతగా కనిపించినప్పటికీ లోలోపల చాలా సంతోషించాడు ఇంటి వాతావరణంలో రాబోయే శుభప్రదమైన మార్పును సంతో షంగా ఆహ్వానిస్తున్నాడు మనసులోనే చిరునవ్వు ముఖంతో వెళ్లిపోయాడు

కిటికీలో కూర్చుని తండ్రికోసం చాలాసేపు ఎదురుచూచింది ఎంతవరకూ తండ్రి రాకపోయినా ఆమె ఈనాడు విసుగుచెందలేదు కోపం ఇసుమంతైనా రాలేదు అలాగే నిద్రపోయింది కూడా తెల్లవారు ఝామున చలిగాలి రివ్వున వీచింది. క్రింద కారాగిన చప్పుడుకు త్రుళ్లిపడి నిద్ర మేల్కొంది. రాత్రంతా అలాగే తండ్రికోసం ఎదురుచూస్తూ కిటికీలో నిద్రించినా ఆమెకు కొంచెమైనా కష్ట మనిపించలేదు ఎదురుగా తండ్రిని కలుసుకోవా లని, లేచి మెట్లవరకూ నడిచింది అప్పటివరకున్న తండ్రిని చూడాలనే ఆదుర్దా రెట్టింపై మెట్ల మీదుగా వేగంతో దిగి హాల్లోకి పరుగెత్తింది. దాదాపు అంతగానూ వేగిరపడుతున్న డాక్టరుగారు బిడ్డనుచూచి 'అమ్మా' అని పిలుస్తూ ముందుకొ వచ్చారు కాళ్లయితే నడిచినవిగానీ నోట మాట రాలేదు మరు నిమిషంలో మనిషి ప్రయత్న పూర్వకంగా అతి ప్రయాసతో కాలు నిలద్రొక్కు కుంటున్నట్టుగా కన్పించాడు అప్పటికే అతని చేతుల్లోకి వచ్చి అక్కున చేరుకున్న బిడ్డకు ఆయన బరువనిపించాడు ఆమె తలయెత్తి చూడ బోయినంతలో డాక్టరు కుప్పలా కూలిపోయాడు. ఏదీ యివ్వకుండా మరేమీ పొందకుండానే వెళ్ళి పోయాడు డాక్టరు

మిగిలింది—అతనమితంగా జాలి చూపిన భౌతిక కాయం మాత్రమే. ★

## సురక్షకమైన,
## దుర్గంధమును పోగొట్టగల
# సింథాల్
## టాయ్‌లెట్ పౌడరు

ఉంగరాలపై ముంగురులు. పెద్ద పెద్ద కళ్లు, తొలి సూర్యునివంటి చిరునవ్వు. తప్పట్లు కొట్టే చిరుచేతులు ... అటువంటి పాపని ముద్దించకుండా వుండేది ఎలా? అంతేకాక—వుండనే వుంది—గోద్రెజ్ సింథాల్ టాయిలెట్ పౌడరు G-11*లో.






బిడ్డమీద, సింథాల్ టాయిలెట్ పౌడరు జల్లండి. సౌఖ్యకరమైన పిల్లు-వలె మృదువైన దాని సువాసనకు బిడ్డ మురిసిపోవడం చూడండి.

* *సింథాల్‌లోగల G-11 - మృదుత్వాన్నీ, తాజాతనాన్నీ, యివ్వడంతో పాటు, వంటి దుర్గంధాన్ని దూరం చేస్తుంది ... చమట పొక్కులను-ఒరపులను రానీయదు.*

కేవలం గోద్రెజ్ సింథాల్ టాయిలెట్ పౌడరులోనే G-11 వుంది. G-11గల సింథాల్ సబ్బుతో స్నానంచేసాక వాడితే ఫలితం రెండింతలు అవుతుంది.

వివేకవంతురాలైన తల్లికి—తన బిడ్డకు సింథాల్‌తో సంరక్షణ చేయడం ముఖ్యమని తెలుసు.




సౌందర్య సాధనములకు పేరెన్నికగన్నది

* "G-11 అంటే ఏమిటి?" అనే ఉచిత శిక్షణ పుస్తకంకోసం, గోద్రెజ్, బొంబాయి-11 అనే చిరునామాకు రాయండి.
* ఎల్. జివేదన్ ఎట్ సి. ఎస్. ఏ. వారి ట్రేడు మార్కు.

CTP.5A/9

## తేనెమనసులు

గౌరవంగా బ్రతికే మధ్య తరగతి కుటుంబంలో జన్మించినది భానుమతి. విధివశంచేత చిన్నాభిన్నమయినది వారి కుటుంబం గత్యంతరంలేక, క్లిష్ట పరిస్థితులలో వర్క్ హార్డ్ బ్రదర్స్ కంపెనీలో టైపిస్టుగా చేరి, జీవితం సాగిస్తున్నది ఆ చిన్నది

అదే కంపెనీలో బిజినెస్ ఎగ్జిక్యూటివ్‌గావుంటున్న చిట్టిబాబును తన పర్సనల్ శెక్రటరీ భానుమతి అందచందాలు, తెలివితేటలు ఆకర్షించినవి ముగ్ధుడయి మోహావేశపూరితుడవుతాడు ప్రేమించానంటూ ఆమె వెంట పడతాడు

చిట్టిబాబుకు అంతకుముందే వివాహమైనదని భానుమతి తెలుసుకుని ఆశ్చర్యపడ్డది అతడి కుటిల స్వభావాన్ని ఆమె హర్షించలేక పోయినది తేనెపూసిన యీ మనిషిని చూసి అసహ్యించుకున్నది

# చిత్రలహరి

ఆమె లేత మనసుకు గాయమయినది. ఆఫీసుల్లో పనిచేసే ఆడవాళ్ల జీవితాలు తెగిన గాలిపటాలు కావనీ, వాళ్లకూ గౌరవ ప్రతిష్టలున్నవనీ, హృదయాలు ఉన్నవనీ, అతనికి తెలుప నిశ్చయించుకుంటుంది భానుమతి అంతేకాదు, అతని నడవడికను సరిదిద్దేందుకు నడుంకడుతుంది ఆమె ఆదుర్తి, ఆత్రేయ, ముళ్లపూడి కలసి రూపొందించిన యీ రసవత్తరమయిన కథ "తేనెమనసులు" చిత్రానికి సంబంధించినది శ్రీ ఆదుర్తి సుబ్బారావు యీచిత్రాన్ని అత్యంత హృద్యమంగా చిత్రించారని కష్టెన్ చూసినవారు అంటున్నారు. కె వి మహదేవన్ సంగీతం యిందులో వొక ప్రత్యేక ఆకర్షణ!

## ఆకాశరామన్న

"రాయబారి ! మర్యాదా, మన్ననా తెలియని వారికి మా పిల్లను యివ్వనన్నామని, మేమతనికి సామంతులం కానేకామని, ఇకమీదటనైనా మా స్వయం పాలనాధికారాన్ని గుర్తించి సవ్యంగా ప్రవర్తించమని—మీ రిపుంజయునితో చెప్పు !" అన్నాడు ఆవేశపూరితుడై అనంగుడు

రాయబారి వెళ్లిపోతున్నాడు

"మహారాజా, ఆవేశపడకండి ! కొంచెం ఆలోచించి నిర్ణయించండి !" చెప్పాడు గోపాలకృష్ణరాయలు.

"ఇంకా ఆలోచించే దేమిటి ?" అన్నాడు అనంగుడు కఠినంగా చూస్తూ.

"చేతకానివాళ్లలా చేతులు ముడుచుకుని, పిల్లనిచ్చి జోహారులు చేయమంటారా ?"

గోపాలకృష్ణరాయలు నిదానవంతుడు. సమయస్ఫూర్తి, బుద్ధి సూక్ష్మత గలవాడు. "నరసింగరాయలు, మహారాజును రెచ్చగొట్టకు !" అని, అనంగునివేపు తిరిగి "మహారాజా, రిపుంజయుడు సామాన్యుడు కాడు ! మహా బలవంతుడు. అతనితో వియ్యానికి మారుగా కయ్యాన్ని కొనితెచ్చుకోడం మనకు, మన ప్రజలకు మంచిదికాదు !" అన్నాడు.

"మమ్మల్ని భయపెడుతున్నారా ?" అడిగాడు అనంగుడు.

"అంతేగా .....వారి దృష్టిలో రిపుంజయుడే గాని, మీ రెందుకూ పనికిరానివారు !"

"వీరికీ, వారికీ ఏవో లాలూచీ లుండబట్టే స్వతంత్రంగా ఉండవలసిన యీ దేశాన్ని ఇంత వరకూ సామంతరాజ్యంగా ఉంచారు !" అన్నాడు నాచాలుడు.

"పోనీ, చక్రవర్తిగారి ప్రాపకం పోతుందని బాధగా ఉంటే వారితో మీరే బంధుత్వం కలుపుకోండి !" నరసింగరాయలు హేళగా చూస్తూ అందించాడు.

గోపాలకృష్ణరాయలుకు క్రోధంతో కనులు పెద్దవయినవి.

"దుర్మార్గుడా, ఏమి కూశావ్ ?" అన్నాడు తీవ్రంగా.

"ఉన్నమాటే అన్నాను !"

"ఎవ రక్కడ ! ఈ వంచకుణ్ణి బంధించండి !" ఆజ్ఞాపించాడు. అతని తలబిరుసు సమాధానం విని.

"ఏమైనా చేయండి కాని, మేము మాత్రం మీలా స్వామి ద్రోహం చేయలేం !"

"మా మహారాజుకు అవమానం జరుగుతుంటే మేము సహించలేం !"

"ఆగండి !" అన్నాడు ఉద్రిక్తుడై అనంగుడు.

"కాదు మహారాజా ! ఈ రాజద్రోహులకు తగినశిక్ష విధించాలి !" చెప్పాడు గోపాలకృష్ణరాయలు

"ఆపని చేయవలసింది మేము. రాజద్రోహ



'మంగమ్మ శపథం'లో యల్. విజయలక్ష్మి

లెవరో, రాజభక్తు లెవరో మాకు బాగా తెలుసు. మా ఉప్పు తింటూ మమ్మల్ని అవమానించే వ్యక్తులు మా రాజ్యంలో ఉండనవసరంలేదు. మీరు తక్షణం ఇక్కణ్ణించి వెళ్ళచ్చు" నిక్కచ్చిగా తన మనోభిప్రాయం వెల్లడించాడు అనంగుడు.

గోపాలకృష్ణరాయులు తెల్లబోయాడు. విన కూడని మాటలు వింటున్నట్లయినది. "మహారాజా !" అన్నాడు ఆత్రంగా.

"అవును, ఇది మా ఆజ్ఞ !"

"మహారాజా ! ఒక్క మనవి. మీమీద, ప్రజల మీద ఉన్న మమకారంతో చెపుతున్నాను. చక్రవర్తిని ఎదిరించకండి. కనీసం మీ సహోదరి గురించి అయినా మీ నిర్ణయాన్ని మార్చుకోండి! దీర్ఘఘోషముని కోడలు కావలసిన ఆమె జీవితాన్ని నాశనం చేయకండి. పసుపు తోరణాలు కట్టవలసిన రాజ్యంలో రణభేరీలు ప్రయోగించి, రక్తపు టేరులు చిందించకండి. అమాయకులయిన ప్రజల్ని మారణహోమానికి బలి చెయ్యకండి." అన్నాడు వేడుతూ గోపాలకృష్ణరాయులు. అనంగుడిలో ఆవేశమే గాని, ఆలోచన తక్కువ. వచ్చుడు

షంగా "మా మంచి చెడ్డలు మాకు తెలును !" అన్నాడు.

"నాన్నా !" అన్నది కళావతి అభిమానంతో : "వద నాన్నా ! ఈనాటికి వారికి అప్పులూ, అంత రంగికులూ దొరికారు. ఇక మన మాటలు వారి కెందుకు ? కంటిపాప కనురెప్పనే వెక్కిరించిందని కన్నతండ్రిలా పెంచి పెద్దచేసిన మీకు తగిన మర్యాదే చేశారు."

"కళావతీ !" అరిచాడు అనంగుడు.

కళావతి అతని పిలుపుకు అదరలేదు. చెక్కు చెదరలేదు. తన మనసులోని మాటను నిశ్చల చిత్తంతో చెప్పింది.

"మహారాజా ! మీ రిప్పుడు బహిష్కరిస్తున్నది మమ్మల్ని కాదు, ధర్మాన్ని, న్యాయాన్ని ! నిజాన్ని మంచినీ గుర్తించలేని స్థితిలో ఉన్న మీకు— యిప్పుడేం చెప్పినా ప్రయోజనంలేదు. కాని, ఒక్క మాట మాత్రం వినండి. మీకు పట్టిన యీ దుష్ట గ్రహణం ఎంతోకాలం ఉండదు. అప్పుడే మీకు శత్రువు లెవరో, మిత్రులెవరో తెలుస్తుంది. అప్పుడు మేమే మీకు దిక్కవుతాము. రా, నాన్నా !" అంటూ ముందుకు సాగినది కళావతి, ఆమెను అనుసరించాడు గోపాలకృష్ణరాయలు.

—ఈ సన్నివేశం గౌరీ ప్రొడక్షన్సువారి సాహసోపేత జానపద చిత్రం "ఆకాశరామన్న" లోనిది. ఈ చిత్రానికి దర్శకుడు జి. విశ్వనాథం, నిర్మాత . యస్ భావనారాయణ

—మోహన్ కుమార్ ★

# అవీ - ఇవీ - అన్నీ

## శ్రీమతి భానుమతికి సన్మానం

"పల్నాటివీర చరిత్ర" చిత్రం నిర్మిస్తున్న అనురూపా యూనిట్ ఫిబ్రవరినెల 28 వ తేదీ నాగార్జున సాగర్ డామ్‌కు ఔట్‌డోర్ షూటింగ్ నిమిత్తం వచ్చిన సందర్భంలో నాగార్జున సారస్వత, సాంస్కృతిక సమితివారు ప్రఖ్యాత సినీనటి శ్రీమతి భానుమతికి సన్మానం చేశారు.

శ్రీమతి భానుమతి యీ సన్మానానికి సమాధానం చెప్తూ తనకు పెద్ద పెద్ద సభలకు హాజరయ్యే అలవాటు యెక్కువగా లేదని, అందుకు ముఖ్య కారణం తనవృత్తి విధుల నుండి లభ్యమయ్యే తీరిక చాల తక్కువని, తనకు దొరికే కొద్ది విరామంతో సాహిత్య పరంగానో, సంగీత పరంగానో కృషి చేస్తుంటానని అన్నారు. పెద్ద సమావేశాలలో అలజడి, కల్లోలం యెక్కువగా వుంటాయనీ. కాని నాగార్జున సారస్వత సాంస్కృతిక సభ్యులు యెంతో గౌరవంతో, క్రమశిక్షణలో శ్లాఘనీయంగా సభను యేర్పాటు చేశారని అన్నారు

ప్రేక్షకులలో నుండి ఒక సభ్యుడు పాట పాడమని కోరగా, యెంతో ఆదరంతో తనను పాడమని కోరినందుకు చాలసంతోషమని, కాని సభ్యులు పాడ మన్నప్పుడు తనుపాడితే అది పాట అనిపించుకోదని — శ్రీమతి భానుమతి చమత్కరించారు.



"లేతమనసులు"లో కృష్ణ.



తార సరోజాదేవి ప్రత్యేక చిత్రం (ఫొటో : ప్రభాకర్)



బొంబాయి ప్రముఖులు శ్రీ హరిష్ సి. జైన్ తమ కుమారులు శ్రీ అవినాష్ వివాహం, చి. సౌ. వనితాతో జరిపించిన సందర్భంలో, అతిథులతో తీసిన చిత్రం ఇది.

## అవీ - ఇవీ - అన్నీ

యాంత్రికంగా, అన్నప్పుడల్లా పాడితే, పాటలో వుండే మార్దవం, మాధుర్యం వుండక పోవచ్చుననీ, భావావేశం, రసస్పందనం కలిగినప్పుడు పాడితే అది వుత్కృష్ట కళాఖండం కాగలదని కూడ అన్నారు. అశేషప్రజానీకం ఆదరంతో తనను గౌరవించినందుకు తనహృదయం కృతజ్ఞతా భావంతో నిండిపోయిందని, ఇంతగొప్ప సన్మానానికి తన అర్హతను నిర్ణయించ వలసింది సంస్కారము గలిగిన సభ్యులేనని, తనకు సన్మానం జరిపిన సాంస్కృతిక సంఘసభ్యులకు యెంతో ఋణపడి యున్నానని శ్రీమతి భానుమతి చెప్పారు.

సమితి కార్యదర్శి శ్రీ యస్. జె నరసింహారావు వందన సమర్పణ చేశారు.

## ఫిలింఫాన్స్ మహాసభలు

ఆంధ్రప్రదేశ్ ఫిలింఫాన్స్ అసోసియేషన్ చతుర్థ మహాసభలు ఫిబ్రవరి 19, 20 తేదీలలో విజయవాడలో వైభవంగా జరిగాయి. మొదటిరోజున రామమోహన్ లైబ్రరీ హాలులో జరిగిన సభకు శ్రీ శ్రీవాత్సవ అధ్యక్షత వహించారు. శ్రీ బందా కనకలింగేశ్వరరావు సభకు ప్రారంభోత్సవం చేస్తూ సినిమాకళతోపాటు నాటక కళ కూడా అభివృద్ధి చెందడం అవసర మన్నారు. అసోసియేషన్ ప్రధాన కార్యదర్శి శ్రీ తుర్లపాటి కుటుంబరావు కార్యదర్శి నివేదిక సమర్పించారు. ఈ సందర్భంలోనే అసోసియేషన్ తరపున ప్రచురిస్తున్న 'ఫిలింఫాన్స్" మాస పత్రికకు శ్రీ బందా ప్రారంభోత్సవం చేశారు. శ్రీయుతులు డాక్టర్ జి. కృష్ణమోహన్, పైడి వెంకటరావు, సుంకర కనకారావు ప్రభృతులు ప్రసంగించారు శ్రీ తుర్లపాటి కుటుంబరావు వందన సమర్పణ చేశారు పిమ్మట ప్రభుత్వ సంగీత కళాశాల విద్యార్థుల గానసభ జరిగింది.

రెండవనాడు బ్యాలట్ విజేతలైన సినిమా నటీనటులకు గాంధీనగరం హిందూ హైస్కూలు ఆవరణలో శ్రీ జి ఎస్. రాజు అధ్యక్షతన బహుమతి ప్రదానోత్సవం జరిగింది. శాసనమండలి అధ్యక్షులు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య బహుమతి ప్రదానోత్సవం చేశాడు. శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, నటుడు శ్రీ పద్మనాభం ఈఉత్సవానికిహాజరైనారు.

ఆహ్వాన సంఘాధ్యక్షులు డాక్టర్ ఎన్. సత్యనారాయణ స్వాగతం చెప్పారు. ఈ సందర్భంలో శ్రీగొట్టిపాటి బ్రహ్మయ్య ప్రసంగిస్తూ ప్రతి పట్టణంలో ఒక నాటకశాల నెలకొల్పాలని సూచించారు. శ్రీ అక్కినేని నాగేశ్వరరావు ప్రసంగిస్తూ, ఫిలింఫాన్స్ అసోసియేషన్లను ప్రోత్సహించడంవల్ల ఉత్తమచిత్రనిర్మాణానికి దోహదం జరగ గలదని అన్నారు. శ్రీ పద్మనాభం కూడా ప్రసంగించారు. ఉత్తమ చిత్రంగా ఎన్నికైన "మూగమనసులు" నిర్మాత శ్రీ సి. సుందరం, శ్రీమతి సావిత్రిగణేష్, పద్మశ్రీ వి. నాగయ్య ప్రభృతులు పంపిన సందేశాలను కార్యదర్శి చదివారు. కోశాధికారి శ్రీ శేషగిరిరావు వందన సమర్పణ చేశారు.

## జంగ్లీ రాజా

అజాద్, మధు, శాంసన్, హీరాసవంత్, లక్ష్మి, మీనాక్షి (ఏనుగ) మున్నగు వారితో పద్మశ్రీ ఫిలింస్‌వారు శ్రీ విశ్వనాథ్ దర్శకత్వంలో నిర్మించిన హిందీ చిత్రం "జంగ్లీరాజా" త్వరలో మాలతీ ఫిలింస్‌వారి ద్వారా విడుదల కానుంది.

## తెలుగు రచయితల సభలు

మూడవ అఖిలభారత తెలుగు రచయితల మహాసభలు తిరుపతిలో "మే" నెల రెండవ వారంలో జరుగును. గత రెండు మహాసభలు, ఆహ్వాన సంఘాల సహకారంతో ఒక తాత్కాలిక నిర్వహణ సంఘం శ్రీ దామోదరం సంజీవయ్యగారి అధ్యక్షతలో ఏర్పడింది.

ఈ మహాసభలు నిర్వహించడానికి ఒక ముసాయిదా నియమావళి తయారు చేయబడింది. ఈ నియమావళి ప్రకారం ఆంధ్ర, ఆంధ్రేతర ప్రాంతాలలోని తెలుగు సాహిత్య సంస్థలకు ప్రాతినిధ్యం లభించేలా జనరల్‌కౌన్సిల్ ఏర్పాటు చేయబడుతోంది. మూడు సంవత్సరాల పైనుంచి సాహిత్యరంగంలో కృషి చేస్తున్న రిజిష్టర్డు తెలుగు సాహిత్య సంస్థలు తమ ప్రాతినిధ్యం కోసం వ్రాయవచ్చు. ఈ జనరల్‌కౌన్సిల్ తిరుపతిలో జరుగు మహసభల సందర్భంలో కలుసుకొని కార్యనిర్వాహక సంఘం ఎన్నుకుంటుంది. వివరాలకు, పోతుకూచి సాంబశివరావు, ప్రధానకార్యదర్శి, 208, న్యూ బోయిగూడ, సికింద్రాబాదు.

—ప్రధానకార్యదర్శి ★

# నేడే చూడండి!



చందమామ

వారి

# దొరికితే దొంగలు

దర్శకత్వం: పి. సుబ్రహ్మణ్యం • సంగీతం: ఎస్. రాజేశ్వరరావు.

SUCCESS

నవయుగ

# 'పద్మశ్రీ' నాగయ్యకు రాజధాని సత్కారం



నటుడు, అనుపమాన గాయకుడు, అసమాన దర్శక నిర్మాత, లలితసంగీత కర్త అయిన చిత్తూరు వి. నాగయ్యకు పద్మశ్రీ బిరుదాన్నిచ్చి భారత ప్రభుత్వం తన కళాభిజ్ఞతను తనే అభినందించుకొన్నది. ఆ పద్మశ్రీ బిరుదాంకితుని ఘన సన్మానితునిజేసి భాగ్యనగర పౌర సంఘం తాను గౌరవాన్నందుకొన్నది.

పుష్పాభిషేకముతో, పుష్పమాలలతో పద్మశ్రీ నాగయ్యను ఎదుర్కొని సభామందిర ప్రాంగణానికి తోడి తెచ్చినారు. సన్మాన సంఘ కార్యదర్శి, అక్కినేని పూర్ణ కుంభముతో శుభము కోరినారు. "అగజానన పద్మాకరం" అన్న వినాయకస్తుతితో శ్రీమతి విజయలక్ష్మి కన్నారావు ఆనాటి కార్యక్రమానికి నాంది గీతం పాడారు.

ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి అధ్యక్షత పదవి నలంకరించారు. వాణిజ్య మంత్రి డాక్టర్ చెన్నారెడ్డి సన్మానితుని సాదర గౌరవాభిమానాలతో ఆహ్వానించారు. లలితకళా మంత్రి ఎం. ఆర్. అప్పారావు వివిధ సన్మాన పత్రికల, సందేశాల పఠనతో అలరించారు. భారతదేశ రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, మంత్రులు కె. ఎల్. రావు, సంజీవరెడ్డి, సంజీవయ్య, కృష్ణమాచార్యులు, పి. వి. రాజమన్నార్ కేరళ పాలకులు వి. వి. గిరి, పట్టంతాణుపిళ్ళె, పృథ్వీరాజ్ కపూర్, దిలీప్‌కుమార్ తమ సంతోషాన్ని సందేశాలుగా పంపించారు. భువినున్న శుభాకాంక్షలు, శుభాభినందనలు అన్నీ ఆ రాత్రి రవీంద్రభారతిని చేరుకున్నవి.

ప్రఖ్యాత దర్శక నిర్మాత పి. పుల్లయ్య, మారుపూరి కోదండరామిరెడ్డి, డా. సి. నారాయణరెడ్డి, ప్రసంగిస్తూ నాగయ్య నటుడూ, సంగీతకారుడే కాదు. మంచి మనసుగల ఒక మహామనిషి, దానపరత్వములో తన లేమిని మరచు కర్ణశిబి అన్నారు. "నాయికా సమ్మేళనంతోబాటు పాత్రోన్మీలనం కూడ చవి చూపిన కళాస్రష్ట నాగయ్య" అన్నారు నారాయణరెడ్డి.

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, ఆంధ్రప్రదేశ్ లలిత కళా అకాడమీ, ఆంధ్రప్రదేశ్ నాట్య సంఘం ఇంకా శతకోటి సంఘాలు నాగయ్యను పుష్ప సౌరభాన్వితుని కావించినవి.

ఒక అంజలి పత్రాన్ని గుమ్మడి వెంకటేశ్వరరావు పంచారు. జగ్గయ్య సందేశాలను వినిపించారు.

గద్గద కంఠంతో తమకు జరిగిన ఘన సన్మానానికి నాగయ్య ఈవిధంగా కృతజ్ఞత తెలుపుకున్నారు. "ఈ ఘనత నాదే కాదు. యావచ్చిత్ర పరిశ్రమది. ఈ పరిశ్రమలో ప్రతి ఒక్కరి సహకార సానుభూతులు లేక యీ నటజీవితం సాధ్యమయేది కాదు. నేను ధరించిన పాత్రలు పరిగణనకు వచ్చేవికాదు. నేను కల్పించిన స్వరాలు పరిపక్వం చెందేవి కాదు. చిత్ర పరిశ్రమ సమష్టి శ్రమకు చక్కని తార్కాణం. సంఘీభావం లేక ఏదీ సిద్ధించని పరిశ్రమలలో ముఖ్యమైనది చిత్ర పరిశ్రమ. నేను నటుడిని కాను. నా చిత్రాలలో నేను నటించలేదు. ఆయా పాత్రలతో సుఖదుఃఖాలు పాలు పంచుకొన్నాను. నవ్వాను. విలపించాను. నిజమైన కళాకారుడు నటుడు కాదు. పాత్రలో లీనమయే సజీవరసం.

నా జీవితమే ఒక సినిమా కథ. పేద కుటుంబంలో పుట్టుక. తండ్రి నేర్పిన విద్య ఉత్తమాదర్శం. చూపిన మార్గం సంగీతం, సంస్కృతం, సంస్కృతి. చిన్ననాడే హరికథలు వినేటప్పుడు తనువు పులకరించేది. తిరుపతి వేంకటేశ్వరుని సన్నిధిని గొంతెత్తి పాడినపుడు జన్మ ధన్యమైనదనిపించేది. ఆనాటి ఆదర్శాలలో ఒకటి పోతన, త్యాగయ్య, రామదాసు వేషాలను చిరస్థాయిగా నిలిచేటట్లు చేద్దామని. ఈనాడు దైవకృపవలన, అశేష మిత్రుల సహకారమువలన ఆ సంకల్పం సిద్ధించినది. రామదాసు పూర్తిచేయటానికి నేనెంత కష్టానికి లోనుకావలసి వచ్చిందో చాలమందికి తెలుసును.

ధనాశ లేదు నాకు. ఉన్నదో లేనిదో యితరులకు లేదనక యివ్వటమే తెలుసు నాకు. వివేకానంద కళాశాలకు 25,000 రూకల విరాళ మిచ్చినపుడు నా చేతిలో చిల్లిగవ్వ లేదు. ఈనాడూ లేదు. కాని, నా కదొక వంత కాదు. ప్రభుత్వం నన్ను దరిద్రావస్థ నుంచి రక్షిస్తుందనే నమ్మకం నాకున్నది"

నాగయ్య నటించిన భక్తపోతన, లవకుశ వంటి చిత్రాలు నెల కొకమారైనా వ్యవధి చేసుకొని చూడాలని ఉంటుంది, అని బ్రహ్మానందరెడ్డి అన్నారు. ఆంధ్ర చిత్ర కళా సంపదలో చాల భాగం నాగయ్య విరాళమే అని డా. చెన్నారెడ్డి అన్నారు. పోతనార్యుని రామాయణం చదివి త్యాగరాజు ముక్తిమార్గదాంఘుడైనట్లు నాగయ్య నటించిన పోతన చూచి ముమ్మిడివరం బాలయోగి ఆధ్యాత్మిక మార్గం అనుసరించారని ఎం. ఆర్. అప్పారావు అన్నారు.

మామిడిపూడి ఆనందం వందన సమర్పణ చేశారు.

పద్మశ్రీ నాగయ్య యితర కార్యక్రమాలు : నాగేశ్వరరావు ఆతిథ్యాన్ని స్వీకరించడం, ఫిలిం క్రిటిక్స్ అసోసియేషన్‌ని ప్రారంభించటం, హైదరాబాద్ ఫిలిం ఛేంబర్ వారి అల్పాహారవిందు నంగీకరించటం మొదలైనవి. వి. ఎ. కె.






వీరబాహుడు హరిశ్చంద్రుని బానిసగా కొనుట

విజయావారి అద్వితీయ పౌరాణిక చిత్రం "సత్య హరిశ్చంద్ర"

నిర్మాత - దర్శకత్వం:
**K. V. రెడ్డి,** B. Sc. Hons




కండ్ల
అందానికి
రక్షణకు

**దర్‌బార్ కాజల్**
కాటుక (రిజిష్టర్డు)

తయారుచేయువారు :—
రాంబీర్ కంపెని, బొంబాయి-4.

---

**క ళా ప్రి య**

శ్రీ ఎన్.టి.రామారావు
అభినందన సంచిక
ఉగాదికి విడుదల
వెల 75 పైసలు
సంచాలకులు: మధుమూర్తి & సి.చంద్రశేఖరం

వివరాలకు:-
"కళాప్రియ" మద్రాసు-24

---



ఉత్సాహానికి
హుషారుకు
కారణం!

**రాగోలైన్**

ఈ పుష్టికరమైన ఆహార పానీయమును
మీరుకూడా పుచ్చుకొని యెల్లప్పుడు
ఉత్సాహంగా వుండండి !!




ఫైన్ కెమికల్ వర్క్స్,
పి. బి. 71, మైసూరు-4

---



**కారట్**

పైస
4
మాత్రం




అన్నిచోట్ల దొరకును

ఓరియంట్ కాస్మెటిక్సు ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు








డి.వి.ఎస్.ప్రొడక్షన్స్

# మంగమ్మ శపథం

దర్శకత్వం: బి.విఠలాచార్య • నిర్మాత: డి.వి.ఎస్.రాజు

కో డైరెక్టర్: యస్.డి.లాల్ రచన: జూనియర్ సముద్రాల సంగీతం: టి.వి.రాజు

ఆంధ్ర: పూర్ణ సీడెడ్: ఎస్.వి.డి నైజాం: ఉషా మైసూర్: సదరన్ మూవీస్ నార్త్ ఇండియా: టాణో పిక్చర్స్

వెండితెర నవల వెల ఒక రూపాయి. ప్రతులకు శ్రీ వెంకటసాయి పబ్లికేషన్స్, మద్రాసు—17

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6&7 Thambuchetty Street
Madras-1. Phone: 29766 & 23713. Chief Editor S. Sambhu Prasad.



'తేనెమనసులు'' ఈస్ట్‌మన్‌కలర్ చిత్రంలో కృష్ణ, సుకన్య



మృదుత్వానికి, మెరపుగొలుపు
కాంతివంతమైన కేశసౌందర్యానికి

రెమి

బ్రిల్లైన్ టైన్
ఉపయోగించండి

CRITERION RP. 555